# నగజాత


గ్రంథకర్త:

ఉభయభాషాప్రవీణ : వి. వి. నరసింహాచార్యులు.

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు

యు. ఎల్. సి. యమ్. హైస్కూలు, గుంటూరు.



ప్రకాశకులు :

మారుతిరామా అండు కో., విజయవాడ.

విద్యావిషయికప్రచారకులు.

# పీఠిక

పూర్వపు సంస్కృతాంధ్ర కవిపుంగవుల కావ్యములలోని కథాసంవిధానము లాశ్చర్యజనకములై యద్భుతముల కాలవాలము లగుచుఁ బాఠకలోకమున కత్యంతామోదమును జేకూర్చుచుండుట సువిదితమే. అట్టి కథారత్నములను తెలుఁగులో వచన కావ్యరూపములతో వెలువరించుట పాఠకలోకమున కెక్కుడుప యుక్తముగ నుండగలదు. అట్టి యూహతోనే కొన్ని కథలను వచనరూపమున వ్రాసియుంటిని. వానిలో నీ 'నగజాత' యను గ్రంథ మొకటి.

పలువు రొకే కథను గ్రహించి పెక్కు కావ్యములుగ వ్రాసినప్పు డొక్కొకదానియం దొక్కొక నూతనత్వ మమరి యున్నఁగాని దానిని జదువుటయందుఁ బాఠకుల కభిరుచి జనింపఁ జాలదు. అందుకనియే (వసుచరిత్రలోని ప్రధానకథాభాగమును గ్రహించి దానికిఁ గొన్ని కూర్పులు మార్పులు చేర్చి దీని కొక క్రొత్తఁదనము వచ్చునట్లు 'నగజాత' యను నీ గ్రంథమును రచించియుంటిని.)

నూతన కల్పనములను జేర్చుటచేఁ బ్రధానకథ కొక యందము చేకూరుటయేకాక నాయికయగు నగజాతకు గొప్ప ప్రభావము కూడఁ జేకూరియున్నది.

ఉన్నతవిద్యాలయములలోని బాల బాలికలు స్వయముగఁ జదువుకొనుటకు వీలగునట్లు సులభశైలిలో నపేక్షజనకముగ నుండున ట్లీ గ్రంథమును రచించియున్నాఁడ.

కనుక విద్యాలయాధికారులును, విద్యాశాఖాధికారులును, పండితులును, నీ గ్రంథము నాదరించి నన్నును, ప్రకాశకులను ప్రోత్సహించి మాకుఁ జేయూత నొసంగ వేడుచున్నాఁడ.

ఇట్లు.

గ్రంథకర్త.

ఓమ్

# నగజాత

## 1

భారతదేశము భక్తులకుఁ బెన్నిధానము. ప్రతిభావంతుల కాలవాలము. పునీత చరితులకుఁ బుట్టినిల్లు. సదాచారసంపన్నులకు జన్మభూమి. సద్గుణఖనులకు సంపన్నిలయము. కళాస్రష్టలకును, గవులకును గల్పతరువు. పతివ్రతామతల్లులకుఁ బ్రధాన మందిరము. పుణ్యక్షేత్రములకావాసభూమి. పవిత్ర నదీనదములకుఁ బట్టుకొమ్మ. అద్భుత విషయముల కొటపట్టు. సుందర సన్నివేశములకు స్వర్గభూమి. మనోహర దృశ్యములకు మేరుపూస.

ఇట్టి ప్రతిభావంతమైన భారతావనియందు దక్షిణదేశమున ధర్మపరమను బ్రాహ్మణాగ్రహార మొండు కలదు. అందు సర్వశాస్త్రపారంగతులైన బ్రాహ్మణోత్తములు నివసించుచుందురు. వారు యజ్ఞయాగాది క్రతువులు చేసి సోమయాజులై వాసిగాంచి యుండిరి. ఆ గ్రామమున నుండు పండితులెల్లరు సాయం సమయములయందు వీధి వాకిటి యరుఁగులమీఁదఁ గూర్చుండి శిష్యులకు వేదశాస్త్రపాఠములను బోధించుచుందురు. ఆ యగ్రహారమున నేమూలఁ జూచినను వేదఘోషలే విన్పడుచుండును.

అట్టి గ్రామములో నొక బ్రాహ్మణకుటుంబమునఁ గృష్ణ సోమయాజి యను విప్రునకుఁ గమలాంబయందుఁ బెద్దతనమున నొక పుత్రుఁడు పుట్టెను. లేకలేక కలిగిన బిడ్డయగుటచేఁ గృష్ణ సోమయాజి పదునొకండవదినమున మహావైభవముగ నామకరణ మహోత్సవము జరిపి పెద్దల యనుమతితో నా బిడ్డకు మాధవ శర్మయని పేరిడెను. అంత నా బాలుఁడు దినదినప్రవర్ధమానుఁడై ముద్దులొలుకు మాటలతోఁ దలిదండ్రులకు ముదముఁ జేకూర్చుచుండెను. ఆతఁడు విద్యాభ్యాసమును బ్రారంభించిన కొలది దినములలోనే సమస్త విద్యలయందు సంపూర్ణ పాండిత్యమును సంపాదించెను.

మాధవుఁడు యుక్తవయస్కుఁడగుటచేఁ దండ్రి యాతనికి వివాహముచేయ సంకల్పించి సంబంధములు విచారింప నారంభించెను. పుత్రుఁ డా ప్రయత్నమును దెలిసికొని తండ్రి దరిఁ జేరి యిట్లు ముచ్చటింపనారంభించెను.

మాధ:—నాయనా! మీరుచేయు ప్రయత్నమెద్దియో తెలుప వేడుచున్నాఁడ.

తండ్రి:—కుమారా! ఇపుడు, నే చేయునది నీ వివాహప్రయత్నముకంటె వేరేమికలదు? విద్యాభ్యాసము ముగించితివి. యుక్తవయస్కుఁడ వైతివి. అనుకూలవతియగు కన్యకను వివాహమాడి గృహస్థధర్మమును నిర్వర్తించి వంశోద్ధారకుఁడవగుము.

మాధ:—జనకా! గృహస్థాశ్రమము పెనురొంపివంటిది. అందుఁ జిక్కుకొనిన పిదప మానవునకు విశ్రాంతియుండదు. నాకుఁ జిన్ననాటినుండియుఁ దీర్ఘయాత్రలుచేయు తలంపు మెండుగఁ గలదు. కనుక నేను వివాహమాడనొల్ల.

తండ్రి:—బిడ్డా! అదియేమి? అన్నియాశ్రమములలోను గృహస్థాశ్రమముత్తమమైనదని శాస్త్రములు చెప్పుచున్నవికదా! ధర్మములను నిర్వర్తించుట కనుకూలమైనది యీ యాశ్రమమ కాదే! ముందు గృహస్థుఁడవై సంతతిఁ బడసి పిదప తీర్థయాత్రలు చేయవచ్చును. అట్లు చేసితివేని పితృఋణమును దీర్చినవాఁడ వయ్యెదవు.

మాధ:—తండ్రీ! యేల ఈరీతి నన్ను నిర్బంధించెదరు? ప్రేమయే వివాహమునకు మూలముగాని నిర్బంధము కాదు కదా!

తండ్రి:—ఇది నిర్బంధము కాదు. విధాయకము. అది యునుగాక నేనును నీ తల్లియు వృద్ధులమైతిమి. నేఁడో రేపో రాలి పోవ సిద్ధముగ నున్నారము. కనుక మా యీ ముద్దు చెల్లించి మాకు సంతసము కలిగించుము.

మాధ:—సంసారములోఁ జిక్కుకొనిన మానవునకు సుంత యైన విశ్రాంతియుండునా? అపుడు నేఁ జేయు యాత్రలేమి? మీ రేమి చేయఁగల్గితిరి? బిడ్డనికోర్కె తండ్రికాకున్న మరెవరు మన్నింతురు? కనుక తమ రా ప్రయత్నమును మాని నన్ను గృతార్థుం జేయుఁడు.

తండ్రి:—తనూజా! ఈమాత్రము తండ్రిమాట వినవలదా? నీవు సంసారివై భార్యతోఁగూడ మాకు పరిచర్యలు చేయుదువని సంతసించుచుంటిమి కదా! కనుక నీ వీ పట్టుదలను మాని పరిణయ మాడుము.

మాధ:—తండ్రీ! సంసారకూపమునఁ బడి పుట్టుగ్రుడ్డినై యుండుటకు నా మన సంగీకరింపకున్నది. కనుక నాపైఁ గోప మూనకుఁడు.

అనుచుం చంద్రికి నమస్కరించి వెడలిపోయెను.

అంత నా సోమయాజి భార్యకడకు వెడలి పుత్రుని పూనికం దెల్పి విచారపడనారంభించెను. ఆమె కొంతవడి విచారించియు ధైర్య మవలంబించి 'నాథా! మీరు విచారపడకుఁడు. మాధవుఁడు మనమాట వినని మూర్ఖుఁడు కాఁడు. కొంతకాల మోపికపట్టితిమేని యాతని మనస్సు మారును. చిన్నతనముచే వాఁ డా రీతిఁ జెప్పియుండునుగాని మఱేమియు లేదు. తమ రీ చింత మానుఁ'డని యోదార్చెను. అంత నాతఁడును జేయునదేమియు లేక మిన్నకుండెను.

మాధవునకుఁ గ్రమక్రమముగాఁ దీర్థయాత్రలకు వెడలుట యందును, నచటి విశేషములు కనులారఁ గాంచుటయందును మక్కువ మిక్కుటము కాఁజొచ్చెను. అంత నాతఁ డా గ్రామమునకు వచ్చిన వైదేశికుల నెల్ల దర్శించి, వారు గాంచిన పుణ్యతీర్థములయందలి విశేషముల నడిగి తెలిసికొనుచు, నెప్పు డెప్పుడు వెడలుదునా? యని యాతురపడుచుఁ గాలముఁ గడపుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు సమస్తయాత్రలు సేవించిన యోగిపుంగవుఁ డొకఁ డా యగ్రహారమునకు వచ్చెను. గ్రామములోనివారెల్లరు తండోపతండములుగా నా మహనీయుని దర్శించి వెడలుచుండిరి. ఆ సంగతిని విన్న మాధవశర్మయు వెడలి యా మహానుభావునకు నమస్కరించి లేచి చేతులు జోడించి వినయముతో నిలచియుండెను. అపు డా యోగి మాధవుని వినయముం గాంచి సంతసించి వానిం గూర్చుండ నియమించి "ఓయీ! యేదియో తెలిసికొనఁదలఁచి వచ్చినట్లు కన్పట్టుచున్నది. ఆ కోర్కె యెద్దియో తెల్పు"మని యడిగెను. "స్వామీ నాకు యాత్రావిశేష

ములం దెలిసికొను కోర్కె తప్ప వేరెద్దియు లేదు. తా మే యే పుణ్యక్షేత్రములను దర్శించితిరో, యందలి విశేషము లెవ్వియో తెల్పి నన్ను ధన్యుం జేయుఁడు" అని మాధవశర్మ విన్నవించెను. అంత నా యోగిపుంగవుఁడు ప్రేమతోఁ దాను జూచిన పుణ్యక్షేత్రములను, వానియొక్క మాహాత్మ్యమును బూసగ్రుచ్చిన రీతి వచించి, "కుమారా! నీవు వెంటనే పుణ్యక్షేత్రములను దర్శించుటకు బయలుదేఱుము. ఆ సందర్శనమే నీ జన్మసాఫల్యమునకు మూలమగును" అని వచించెను. అంతట మాధవుఁడు మునికి నమస్కరించి తన యింటికి వెడలి యొంటరిగాఁ గూర్చుండి యి ట్లాలోచింపనారంభించెను.

'యోగిపుంగవుని యాజ్ఞానుసారముగా నే నిపుడే తీర్థయాత్రలకేగుట యెంతయు నుచితముగఁ గన్పట్టుచున్నది. కాని తలిదండ్రుల యాటంకమొకటి నన్ను బాధించుచున్నది. తలిదండ్రులకుఁ దెల్పకయే వెడలుదమన్న వారు నాయందలి ప్రేమచేఁ బ్రాణమును విడతురు. అది యెంతయు ననుచితమగుకార్యము. ఈ వృత్తాంతమును దెల్పితినేని వా రెంతమాత్రము నిందుల కిష్టపడక నా పయనమున కాటంకముఁ గల్గింతురు. ఇపుడేమి చేయుదును?' అని చాల తడ వాలోచించి తుదకుఁ దన తలిదండ్రులకుఁ జెప్పి వెడలుటయే తన ధర్మమని నిశ్చయించుకొని తలిదండ్రులకడకు వెడలి నమస్కరించి తన ప్రయాణమును గూర్చి మెలమెల్లగ మనవి చేసెను.

వా రా మాటలు వినినంతనే యడలి కన్నీరు కార్చుచుఁ బుత్రు నెన్నియోవిధముల పోవలదని వారించిరి. అపుడు మాధవుఁడు "జనకులారా! మీ రీ రీతి భయపడనేల? నే ననతికాలము

లోనే యాత్రలు ముగించి వచ్చి మీ యిష్టప్రకారమే వివాహ మాడి మీ సేవలు చేయుచునుందును. కనుక న న్నాశీర్వదించి పంపవేడుచున్నాఁడ" నని విన్నవించెను. అంత వారు తమ బిడ్డ తిరిగివచ్చియైన వివాహమాడుట కిష్టపడెనుగదాయని సంతసించి, మారుపలుకక ఆశీర్వదించి పంపిరి.

మాధవుఁడు తల్లిదండ్రు లంగీకరించినందులకు సంతస మందిబయలుదేరి, క్రమక్రమముగాఁ బుణ్యక్షేత్రములకు వెడలుచు నచటి తీర్థములలో స్నానముచేయుచు, నందలి దేవదేవుల ననేక రీతుల వినుతించుచు, దక్షిణదేశయాత్రల నన్నిటిని బూర్తిఁ గావించి మహదానందమొందెను. ఉత్తరదేశయాత్రలును జేయ సమకట్టి యటనుండి బయలుదేటి కొన్నియాత్రలు సేవించి యాత్రి కులవలన నధిష్ఠానపుర సౌందర్యమును విని యచటి కేగసమకట్టి కొలది దినములలోనే యా పట్టణమును సమీపించెను.

అయ్యది యతివిశాలమై, క్రొత్తవారికి ప్రవేశింప వీలు కానిదై, అత్యున్నతములైన సౌధరాజములతోఁగూడి దిగ్భ్రమ కలిగించుచుండెను. అట్టి పట్టణముఁ బ్రవేశించి యొకవీధిం బడి పోగాఁబోగాఁ బ్రొద్దుగ్రుంకునప్పటి కొక దేవాలయ సమీపము నకుఁ జేరెను. క్రొత్తవాఁడగుటచే రాత్రి సమయమున నెటు వెళ్ల టకును దోచక యానాటి కచటనే నివసింపఁదలఁచినవాఁడై యా యాలయమందలి పుష్కరిణికేగి యాచమించి గోపురద్వారము నకు ముందున్న విశాలమైన యరుఁగుమీఁద నుత్తరీయము పఱ చుకొని పరుండెను. అది పూర్ణిమయగుటచేఁ జలువలు వెదఁ జల్లు పండువెన్నెలలు కాయుచుండెను. అట్టి వెన్నెలలోఁ బరుండు టచేతను, భగలంతయుఁ బ్రయాణపు బడలికచేతను, నాతనికి వెం

టనే గాఢముగా నిద్రపట్టెను. వేకువ యైనంతనే మేల్కాంచి భగవంతుని నుతించి, స్నానసంధ్యాదుల నిర్వర్తించి యరుఁగు మీఁదనే కూర్చుండి యీ విధముగ నాలోచింప నారంభించెను.

'నే నింతవఱ కెన్నియో పట్టణములనుజూచియుంటినిగాని యిట్టి మహాపట్టణమును గాంచియెఱుఁగ. దీని సౌందర్యము వర్ణనాతీతముకదా? ఇందుఁ జూడఁదగిన విశేషములు పెక్కులు గలవని యాత్రికులు చెప్పఁగా వినియుంటిని. అట్టి విశేషముల నన్నిటిఁ జూచుట క్రొత్తవాఁడనగు నా కెట్లు సంభవించునో తోపకున్నది. ఇతరుల సహాయములేక యిందలి విశేషములం గాంచుట కష్టతరము. నా కెవ రీ సహాయము చేయువారు?' అని విచారించుచుండు నంతలో సూర్యోదయమాయెను. అప్పుడు లోకబాంధవుఁడు పూర్వదిశాంగన నెన్నొసట ధరించిన కుంకుమబొట్టా యనురీతి నెఱ్ఱని కాంతితోఁ దూర్పుకొండశిఖరమునఁ బ్రకాశించుచుండెను. అంత లేచి సూర్యభగవానునకు వందనము లొనర్చి యా యరుఁగుమీఁదనే కూర్చుండియుండెను.

అట్టి సమయమున నా పట్టణమున నివసించు బ్రాహ్మణుఁ డొకఁడు ప్రాతఃకాలముననే స్నానసంధ్యాదులొనర్చి దేవుని దర్శించుటకై యా యాలయద్వారముకడకు వచ్చి వేదకపై నాసీనుఁడై యున్న బ్రాహ్మణవటువుం గాంచి 'ఆర్యా! మీ దే దేశము? మీ పేరెయ్యది? ఏమిపనిమీఁద నిట కేగుదెంచితిరి? సర్వము వినిపింపుఁ' డని యడిగెను. అపుడు మాధవశర్మ నమస్కరించి 'భూసురోత్తమా! మాది దక్షిణదేశము. అందలి ధర్మవరమను బ్రాహ్మణాగ్రహారమున నివసించు నొక బ్రాహ్మణుని పుత్త్రుఁడను. యజుశ్శాఖాధ్యాయిని. నన్ను వ్యవహారసమయములు

యందు మాధవుఁడని పిలుతురు. విద్యాభ్యాసము ముగించిన పిదపఁ దీర్ఘయాత్రలు చేయఁ గోరిక కలవాఁడనై తలిదండ్రుల యనుమతిం బడసి బయలుదేఱి దక్షిణదేశయాత్రల ముగించి, యుత్తరదేశయాత్రలు చేయుచు నిన్నటి సంధ్యాకాలమున కీ పట్టణముఁ జేరి, యెటు పోవుటకును దిక్కుతోచక మెల్లగా నీ యాలయముం జేరి యీ రాత్రి యంతయు నీ యరుఁగుమీఁదనే పరుండి కాలముఁ గడపితిని. ఈ పట్టణముయొక్క ప్రభావమును, సౌందర్యమును యాత్రికులు వేనోళ్ళఁ బొగడఁగా విని చూడఁ గుతూహలము కలవాడనయ్యు నొంటరివాఁడ నగుటచేతను, నీగ్రామమునకుఁ గ్రొత్తవాఁడనగుటచేతను నెటుబోవుటకును దారి తెన్నుఁ గానక యిందే యున్నవాఁడ.-ద్విజసత్తమా! నా యీ కోరిక యెట్లు నెఱవేరునో తోచకయున్నది' అని దీనముగాఁ బల్కెను. అపు డా బ్రాహ్మణుఁడు వైదేశికునింగాంచి 'అయ్యా! మీ రేల దిగులొం దెదరు? దేవుని సేవించిన పిదప నేనే తమ కీ పట్టణమందలి విశేషములన్నియుఁ జూపుదును. భయపడకుడు' అని చెప్పునప్పటికి మాధవశర్మ సంతసించినవాఁడై 'మహాత్మా! మీరు నా పాలిటి దైవముపగిది వచ్చియున్నారు. దిక్కులేనివారికి దైవమే దిక్కను నుడికార మసత్యము కాదు కదా? ఆ దైవమే నాకు సాయపడ మీ రూపముతో వచ్చియుండునని తలఁచుచున్నాఁడ. ముందుగఁ దమ కులగోత్రనామములఁ దెల్పి నా వీనులకు విందొనర్పుఁ'డనుచు బ్రార్థించెను.

అంత నాతఁడు 'అయ్యా! నే నీ వీట నివసించు బ్రాహ్మణ గృహస్థుఁడను. నన్ను శివభట్టని పిల్చుచుందురు. మీరు కడు దూరము ప్రయాణము చేయుటచేతను, రాత్రియంతయు నుపవ

పించుటచేతను మిగుల నలసియున్నారు. కనుక మా గృహము నకు విచ్చేసి నా యిడు నాతిథ్యము స్వీకరించి మా గృహమును బవిత్రముజేయుఁడు. పిదప మీ కీ పట్టణమందలి విశేషముల నన్నిటిఁ జూపుదు'ననుచుఁ బల్క మాధవశర్మ సంతసించి యందుల కియ్యకొనెను. అంతట శివభట్టు మాధవశర్మను వెంటఁబెట్టుకొని యాలయములోనికేగి, యందలి దివ్యమూర్తిని దర్శించి, ప్రదక్షిణ నమస్కారములను గావించి, కొంతతడవు దేవదేవుని నుతించి యటనుండి తన యింటికి వెడలి, యా వైదేశికున కుచితరీతి నాతిథ్యముచేసెను. ఆ దినమంతయు వాని గృహముననే నివసించి, మఱునాటి యుదయమునఁ బట్టణమును జూచు కోరిక యతిశయింప, మాధవశర్మ శివభట్టును వేఁడుకొనెను. అంత నాతఁడు 'ద్విజోత్తమా! యీ పట్టణము సప్త ప్రాకారములతోఁగూడి, యందమున నమరావతింబోలి సమస్త సంపదలతోఁ దులఁదూగు చుండును. ఇందలి విశేషము లన్నియుఁ గాంచుట కేండ్లును బూండ్లును బట్టును. కనుక నిందలి ముఖ్య ప్రదేశములను మాత్రము చూపుదును. మనము ముందు మొదటి ప్రాకారమున కేగి యచటనుండి చూచుచు వత్తము. ఇక బయలుదేఱు'మని నుడువ మాధవశర్మ సంతసించి యాతనితోఁగూడఁ బ్రథమ ప్రాకారములోనికి వెడలెను.

మా:—ఔరా! యీ ప్రాకారసంపదను దిలకింప నా రెండు కన్నులు చాలవుసుమా! దీని సౌందర్యమును వర్ణింప నాదిశేషునకును శక్యముకాదనుట యతిశయోక్తికాదు. ఈ వీధులసోయగము, ఆ మేడల చక్కఁదనము, ఆ గోపురముల యౌన్నత్యము

దిగ్భ్రాంతిని గల్గించుచున్నవి. అయ్యా! ఇం దెవరు నివసింతురు ?

శివ—: ఈ ప్రాకారమున రాజకుటుంబమువారునివసించుచుందురు. నవరత్న నిర్మితములై దేదీప్యమానముగ వెలుంగు కాంతులతోఁ గూడి, యున్నతగోపురములు కలిగి మన కనుల యెదుటఁ గాన్పించు దివ్యసౌధమే మహారాజప్రాసాదము. దాని ప్రక్కనసుండు రత్నాల చవికయే కొలువుకూటము. మిగిలినవన్నియు రాజబంధువులు నివసించునట్టి మేడలు. చూచితివికదా దీనియందము! ఇఁక రెండవ ప్రాకారమునకు వెడలుదము.

మా:—ఆహా! నేటికిఁగదా నా కన్నులు సఫలత నొందినవి. ఆ ప్రాసాదములను జూచినకొలఁది చూడవలెననియే కోర్కె కలుగుచున్నది. ఆర్యా! ఈ రెండవ ప్రాకారమున నెవరు నివసింతురు ? ఇందలి విశేషము లేవి ?

శివ:—ఈ ప్రాకారమున రథ, గజ, తురగశాల లుండును. ఇటు కన్పట్టు శాలలో గంధగజంబులు లెక్కకు మిక్కుటములై యుండును. ఈ మదపుటేనుఁగులు గంభీరముగ నెట్లు చూచుచున్నవో కాంచితివా? ఆ ప్రక్కన నున్న శాలలలో గంధర్వహయంబులు కట్టివేయఁబడి యున్నవి. ఈ మహారాజునకుఁ గల యుత్తమజాతి గజంబులుగాని, హయంబులుగాని మఱి యేరాజునకును లేవని ప్రతీతి. ఇఁక మూఁడవ ప్రాకారముం జేరుదము.

మా:—ఆహా! ఈ ప్రాకారమును జేరునప్పటికిఁ జెవుల కింపైన గానములు విన్పడుచున్నవిసుమా. ఆ ప్రాకారమున రత్నాల

మేడలను గనుల పండువుగాఁ జూచితిని. ఈ ప్రాకారమున సామగానములను జెవుల పండువుగా వినుచున్నాఁడ. ఎంతటి యదృష్టము!

శివ:—ఇందు భూసురశ్రేష్ఠులు నివసించుచుందురు. వీరు వేదములను దలక్రిందుగ వల్లెవేయుచు, సమస్త శాస్త్రముల నభ్యసించి బ్రహ్మదేవుని సైతము 'ముదిమది తప్పిన మొదటి వే'ల్పని ధిక్కరించుచు సదా యజ్ఞయాగాది కర్మలను నిరంతరాయముగ నిర్వర్తించుచు సదాచార సంపన్నులై దేవతలచే సైతము కొనియాడఁబడుచు గొప్ప ప్రభావముగల్గి పేరెన్నికఁ గాంచియుండిరి. అట్టివారి సామగానము లివ్యవి. ఇఁక నిటనుండి మఱియొక ప్రాకారమునకు వెడలుదము.

మా:—మహానుభావా! ఇదియేమి? యిట నా యువకబృంద మేరీతి విల్లులను ధరించి వెడలుచున్నారో చూచితిరా? వారెందుల కారీతి వెళ్లుచున్నారు? ఎచటికి? మనము ప్రవేశించినది నాలవ ప్రాకారము కాదా?

శివ:—అవును. ఇం దుత్తమ క్షత్రియులు నివసింతురు. విల్లులఁ జేఁబూని వెళ్లువారు రాజకుమారులు. వీర లస్త్రవిద్యాభ్యాసము నకై తమ గురువులతోఁగూడఁ బురము వెలుపలనున్న విశాల ప్రదేశముల కేగుచున్నారు. ఇందుఁగల రాజచూడామణు లెల్లరు నిరుపమాన పరాక్రమవంతులై సంగరాంగణంబునఁ బరశురామునిఁగూడఁ బరిభవింపఁ జాలియుందురు. వీరికి గర్వము భుజములయందే కాని మనమున మొత్తమంతైన మొనసియుండదు. ఈ వీరుల పరాక్రమము వర్ణింపఁదరము కానిది.

మా:—ఇది యైదవ ప్రాకారమని తలంచెదను. ఈ ప్రాకారమం దలి గృహములేమి, అంగడులేమి మహావైభవముగ నున్నయవి. ఇం దెవరు నివసింతురో చెప్పుదురా?

శివ:—ఇందు నివసించువారు వైశ్యశిఖామణులు. వీరు సమస్త సంపదలతోఁ దులఁదూగుచు దానధర్మములు చేయుటయందు దక్షులై, చెలికాఁడగు శివుని భిక్షాటనమును గూడ మాన్పఁ జాలని ధనదు ధనమది యెంతయని హేళనఁ జేయుచుఁ గోటికిఁ బడగయెత్తిన మహాసంపన్నులు. ఈ బారులు తీరియున్నవే రత్నాల యంగళ్ళు. ఇఁక నాలవ ప్రాకారమును జేరుదము.

మా:—ఆహా! యీ ధాన్యపురాసు లేమి? ఈ పశుసమృద్ధి యేమి? వీథులయందుఁ దిరుగాడు గోగణముం జూచిన శ్రీకృష్ణభగవానుని యాలమంద తలపునకుఁ వచ్చుచున్నది సుమా!

శివ:—ఇందు నాలవ కొలమువారు నివసించుచుందురు. వీ రెల్లపుడు గోగణమును దైవభావముతోఁ బూజించుచు నేమఱక యాహారాదుల నొసంగి వానిం బోషించుచుందురు. వీరికి భూములపై నుండు మక్కువ పటిమటి చెప్పఁదగియుండును. అట్లు నమ్మి కష్టించుచుండుటవల్లనే యా పొలములయందుఁ బంటలపైఁ బంట లమరుచుండును. నిక్కువముగా వీరలే దేశసౌభాగ్యమునకు మూలకందములని చెప్పఁదగినవారు. వీరి కాయకష్టమే యీ ధాన్యరాసులకుఁ గారణమైనది. ద్విజసత్తమా! ఇఁక నేడవ ప్రాకారము మాత్రమే మిగిలియున్నది. మాధ్యాహ్నిక క్రియలకు వేళ సమీపించినది. అందుఁ జూడఁ దగిన విశేషము లంతగ లేవు. వినినం

జాలును. ఏడవప్రాకారమునఁబహాతివర్గము నివసించుచుండును. ఇటనుండి యీ మార్గమునఁ బుర బహిర్ద్వారముం జేరుదము.

మా:—ఈ బహిర్ద్వారముయొక్క శిల్పనైపుణ్యము వర్ణనాతీతముగ నున్నదిసుమా. మిక్కిలి యెత్తుగాఁ గన్పడు నా గోడ లెవ్వియో తెల్పుఁడు?

శివ:—అవియే యీ పట్టణ సంరక్షణమున కేర్పఱచిన ప్రాకారపు గోడలు. ఈ గోడలకు వెలుపలి భాగమున మహాసముద్రములం బోలిన యగడ్త లంతులేని లోతు గలవియై చూడ భయంకరముగాఁ గన్పట్టుచుండును. అదిగో యీ కోట బురుజు లాకసము నంటి బంగరు రంగులు పిసాళించుచు దేదీప్యమానముగ నెట్లు వెలుంగుచున్నవో చూడుఁడు.

మా:—ఆహా! యీ పట్టణము భూలోకస్వర్గపురముంబోలి నేత్రానందకరమై ప్రకాశించుచున్నది. ఇట్టి పట్టణరాజమున కధిపతి యే రాజచూడామణియో విశదపఱచుఁడు?

శివ:—మా నేలయేలిక దేవతాప్రభావము గల్గి యసమాన పరాక్రమవంతుఁడై సుగుణపుంజములకు గనియైన వసుమహారాజు. ఆ మహనీయుని పరాక్రమమేమి, ధర్మబుద్ధియేమి, ప్రజాపాలనమం దావరమేమి చెప్పనలవికానివి. ఈ మహారాజు పాలించు రాజ్యము రామరాజ్యమై వాసిఁగాంచుచున్నది. ప్రజలను గన్నబిడ్డలవలెఁ గాపాడుచుండును. సమస్త దేశాధీశులును నీతని పరాక్రమమున • కులికి పాదాక్రాంతులై యుందురు. అటు చూడుము. ఇక్కడకు సూటిగా నున్నత శిఖరములతోఁ గన్పడునట్టిది కోలాహలమను పర్వతరాజము. ఈ పర్వత పంక్తులు హిమాలయముతోఁ గలసియుండును.

అందువలన దీని దూరము లెక్కింప వీలుకాకయున్నది. ఈ పర్వతరాజముపైన సుదూరముగ నున్న యుత్తరపుఁ జరియ మీఁద నొక పుణ్యాశ్రమము కలదు. దానికిఁ గశ్యపుఁడను మునివరుఁడు కులపతియైయుండును. ఆ మహనీయుఁ డాగతానాగతములఁ దెలిసిన మహాజ్ఞాని. ఎల్ల ధర్మముల నెఱింగిన వాఁడు. ఆ తపోధనుని దర్శనము జన్మపావనము. ఇట్లు చెప్పుచుండఁగనే సూర్యభగవానుఁ డాకాశమధ్యభాగ మలంకరించెను. అపుడు శివభట్టు 'బ్రాహ్మణోత్తమా! మాధ్యాహ్నిక క్రియల నిర్వర్తింప వేళయైనది. ఇఁక నిలువ వీలులేదు. సెల వొసంగుఁ'డనుచుఁ బల్కి యాతని యనుమతిమీఁదనే స్వగృహమునకు వెడలెను.

పిదప మాధవశర్మ శివభట్టుయొక్క వినయ సౌజన్యములనే మనమున మెచ్చుకొనుచుఁ దనకును మాధ్యాహ్నిక కర్మలాచరించుటకు వేళ యైనందున నచటి కనతిదూరముననున్న పరమపావనియగు శుక్తిమతిం జేరి యందు స్నానసంధ్యాది కృత్యముల నిర్వర్తించి, యచటి చెట్లయందున్న ఫలములఁ గోసి, మెసవి, నీరములం గ్రోలి కోలాహల పర్వతపుఁ జరియపైనున్న కశ్యపుని యాశ్రమమునకుఁ బయనమై కతిపయ ప్రయాణములలో వెడలెను.

నాటి దినమున మాధవశర్మ యాశ్రమమునకు వెడలు వేళకు మునిసత్తముఁడు తపము చాలించి మాధ్యాహ్నిక క్రియలు ముగించి శిష్యు లొసంగిన కందమూలాదుల నారగించి యొక మఱ్ఱిక్రింద కృష్ణాజినముపైఁ గూర్చుండి శిష్యబృందమున కుపదేశములు సేయుచుండెను. మాధవశర్మయు నా సమయమున నచ

టికి వెడలి బ్రహ్మతేజ ముట్టిపడుచు ధర్మోపదేశములు సేయు చున్న మునిపుంగవుం గాంచి తన జన్మ సఫలమైనదిగ భావించి దూరమునుండియే నయభయములుతోప నతులొనర్చి తానును నొక మూలఁ గూర్చుండి యా మహనీయుఁడు బోధించు ధర్మవిశేష ముల నతి భక్తితో వినుచునుండెను. సంధ్యాకాలము సమీపించినం తనే శిష్యులెల్లరు సంధ్యావందనాది కర్మల నిర్వర్తించుటకు వెడ లిరి. కులపతియు నటనుండి లేవఁబోవునంతలో మాధవశర్మ సమీపించి సాగిలి మ్రొక్కి తన వృత్తాంతము నామూలాగ్రముగ వినిపించి తనసుగూడ శిష్యకోటిలోఁ జేర్చుకొని ధర్మోపదేశము లను జేయ వేడుకొనెను. కాశ్యపుఁ డాతని ముఖలక్షణములను గాంచి సంతసించి వాని ప్రార్థనము సేయకొనెను. అంతట నా మునిపతియు స్నానసంధ్యాదుల నిర్వర్తించుటకు వెడలెను.

# 2

మాధవశర్మ కులపతికి శిష్యుఁడై నయవినయములు తోప శుశ్రూషలు సేయుచు నతిభక్తితో నా ముని చేయు ధర్మప్రబోధములను వినుచుండెను. మునిపతియు నాతనియందు గల్గిన యనురాగముచే ననేక నూతన విషయములను బోధించుచుండెను. ఈరీతిఁ గొన్నిదినములు గడచిన పిదప నొకనాఁడు కశ్యపమహర్షి యథారీతి వేదాంత విషయము నుపన్యసింప నారంభించెను. శిష్యులెల్లరు నెదుటనే బారులుతీరి కూర్చుండియుండిరి. మాధవశర్మయు మునిపతికి సమీపముననే కూర్చుండి గురువర్యులు బోధించు విషయములను శ్రద్ధాభక్తులతో వినుచుండెను.

కశ్యపుఁ డాతని భక్తిప్రపత్తుల నీక్షించి, యాతనివృత్తాంతమును దెలిసికొనఁదలఁచి దివ్యదృష్టితోఁ బరికించి, సర్వము నెఱింగి విస్మితుఁడై తలయూఁపి మందహాసముఁ జేయుచు "ఔరా! యీతఁడు పూర్వజన్మమున జేసిన భగవదపచారము చేతనేగదా భూలోకమున జన్మింపవలసి వచ్చినది. ఎంతటివానికైనఁ గర్మ దాటరానిది సుమా" యని యెల్లరు వినఁ బల్కి మిన్నకుండెను. అపుడు శిష్యులెల్ల రాతని పూర్వజన్మ వృత్తాంతమును వినఁ గుతూహలము కలవారలై 'గురూత్తమా! ఈతఁడు పూర్వజన్మమున నెవరో, భగవంతున కేమి యపచారము గావించెనో తెల్పుఁ' డని ప్రార్థింపఁగా నా మహనీయుఁ డీతని పూర్వజన్మ వృత్తాంతము నిట్లు నుడువ నారంభించెను.

"ఈతఁడు పూర్వజన్మమున గంధర్వజాతిలో జనించిన సుదాముఁడను గంధర్వరాజు. ఈతఁడు నిరతము శివపూజ సేయుచుండువాఁడు. ఒకనాఁ డీతఁడు కర్మవశమువలన శివునికై కట్టిన పూలదండను గామాంధుఁడై తన భార్య తలయందు ముడిచి యిష్టభోగము ననుభవించి, పిదప నామె తీసిపైచిన పూలదండలతోనే యా పరమేశ్వరుని బూజించెను. అపుడు శివుఁ డాగ్రహము చెంది 'ఓయీ! కామాంధతచేఁ గన్నుమిన్ను గానక యిట్టి యకృత్యమును గావించితివిగాన నీవు భార్యావియోగముం బొంది భూలోకమున హీనజాతియందు జన్మింతువుగాక!' అని శపించెను. అంతఁ దెలివొంది చేసిన యకార్యమునకుఁ బశ్చాత్తప్తుఁడై యా పరాత్పరు ననేక విధములుగ వేడుకొనెను. భక్తవత్సలుఁడైన భగవంతుఁడు కనికరించి 'గంధర్వరాజా! నా యిడిన శాప మనుభవింపక తీరదు. కాని నీవు భూలోకమున హీనజాతి యందు జనింపక యుత్తమజాతియందు జననమొంది, జ్ఞానవంతుఁడవై పెక్కు పుణ్యక్షేత్రముల దర్శించి, తుద కచేతనములగు నదీశైలములకు జనించి దేవతాప్రభావముగల యొక యువతి పరిణయ వృత్తాంతమును వినినంతనే శాపము తీరి, యథారూపమును ధరించి, భార్యతోఁగలిసి యటనుండి యేమఱక నా సేవ జేయుచుండు'మనుచు శాపవిమోచనముం దెల్పి యంతర్ధానమయ్యెను. ఆ శాపమువలన నితఁ డీ లోకమున బ్రాహ్మణుఁడై జననమొంది, పరిణయమాడుట కొల్లక యాత్రలు సేయుచు భక్తితత్పరుఁడై యీ యాశ్రమమునకు వచ్చి నా ప్రబోధములు వినుట సంభవించె"నని చెప్పెను. గురువర్యులు చెప్పిన యీ వృత్తాంతమును విని మాధవశర్మ మిగుల వెతఁజెందుచు నా యువతి

వృత్తాంతమును విని శాపమువలనఁ గలిగిన యీ జన్మను వదలఁ దలఁచి యట్టి పవిత్ర చరిత్రమును దెల్ప నీ మహానీయుఁడే సమర్థుఁడని భావించి, మునిపుంగవునకు సాగిలిమ్రొక్కి 'మహాత్మా! ఆ యువతి యెవరు? ఆమె యే దేశమున నివసించుచున్నది. ఆమె పేరేమి? సర్వము నెఱిఁగించి నను ధన్యుం జేయుఁ'డని ప్రార్థించెను. 'మాధవా! నీకు వినవలెనని కుతూహలము కల్గినఁ జెప్పెద నాలిఁపుము.

"ఇదిగో! ఈ యాశ్రమమున కుత్తరపు దిశయందుఁ గ్రిందుగా నొక కోనగలదు. అందొక మణిహర్మ్యము ధగధగలాడు కాంతులతో ప్రకాశించుచుండును. ఆ మేడయం దా యువతి నగజాత యను పేరుతోఁ జెలికత్తియలం గలిసి నివసించుచుండును. ఆమెయే నదీశైలములకు జనించిన యువతి. ఆమె పరిణయవృత్తాంతమును వినుటయే నీ శాపవిముక్తికిఁ గారణమని శివుఁడనుగ్రహించియున్నాఁ'డనుచు వాక్రుచ్చెను. అపు డాతడు మహాద్భుతమంది 'మహాత్మా! ఆమెజన్మ మతి విచిత్రమైనదిగఁ గన్పట్టుచున్నది. ఆ మహాసాధ్వి నెవరు పరిణయమాడిరి? వారి కెట్లు సమాగమము సమకూడినది? ఆ వృత్తాంత మంతటి నామూలాగ్రముగా విని శాపవిమోచనమును బొందఁ గోరిక యతిశయించుచున్నది. అయాచితముగ లభించిన మహాత్ముల సందర్శనము నిష్ఫలము కాఁజాలదు. సత్పురుషుల సేవయే సకలార్థసాధకము. ఈ శిష్యపరమాణువునందు వాత్సల్యముంచి నా కోరిక యీడేర్పుఁ'డని సవినయముగఁ బ్రార్థించెను. అంతట నా మునిపుంగవు డాతని ప్రార్థనము నాలించి యనుగ్రహము కలవాడై 'ఓయీ

వినఁ గుతూహలము కలదేని యామె పావనచరిత్రము నట్లే చెప్పుదును. ఈ దినము వేళ యతిక్రమించినది. రేపు సర్వము వినిపింతు' ననుచు వాక్రుచ్చి సూర్యాస్తమయము కానున్నందున నాఁటికి సభ ముగించెను. ఎల్లరును సంధ్యావందనాది కర్మల నెఱవేర్చుటకు వెడలిరి.

# 3

ఇదియె శాపవిముక్తి దివసము. సంతోషదాయకమగు శుభదినము. ఇట్టి సుదినమున దిక్కులన్నియు నిర్మలములై యుండెను. ఆశ్రమములోని వృక్షములన్నియుఁ దమ యానందమును వెలిబుచ్చుచున్నవా యన్నట్లు పుష్పించి కళకళలాడుచుండెను. ఈ దినమున మాధవుని శాపవృత్తాంతమును విన నాతురత కలవారై శిష్యులెల్లరు నిత్యకర్మల నతిత్వరితముగా నిర్వర్తించుకొని గోష్ఠిసమయమున కెదురుచూచుచునుండిరి.

మాధవశర్మయుఁ దన శాపవిమోచన వృత్తాంతమును వినుటయం దాతురత కలవాఁడై మునిరాక కెదురుచూచుచుండెను. సమయము సమీపించిన కొలఁది యెల్లర కాతురత యధికము కాఁజొచ్చెను. ఈ దినము పరమపావన చరిత్రము చెప్పఁబడు నను వార్త సమీపాశ్రమములలోని మహర్షులకుఁ దెలియుటచే వారును వచ్చియుండిరి. అందువలన నా యాశ్రమమందలి సభాప్రదేశమంతయు ముందుగనే నిండి సభ్యులతోఁ గిటకిటలాడుచుండెను. మాధవుఁడును కులపతియాసనమునకు సమీపముననే భక్తితాత్పర్యములతో నిలచి యుండెను. కాశ్యపుఁడు సంధ్యోపాసనాదులను, నగ్నికార్యములను నిర్వర్తించి సభ్యులతో నిండి యున్న యా సభాప్రదేశమునకు విచ్చేసెను. ఆ మహనీయుఁడు వచ్చునప్పటికి సభలోని వారెల్లరు చేతులు జోడించి నిశ్శబ్దముగా నిలచియుండిరి. అంతట మునిపతి మెల్లని నడకలతో వచ్చి

తనకుఁ బ్రత్యేకింపఁబడిన లేడిచర్మముపైఁ గూర్చుండెను. సభ్యులెల్లరును యథాస్థానములయం దుపవిష్టులైరి. మాధవుఁడును గులపతికి సమీపమునఁ గూర్చుండి వినయముతోఁ దలయొగ్గి యుండెను. అంత మునిపతి ప్రార్థనచేసి యా పావన చరిత్ర మును చెప్పనారంభించెను.

"మాధవా! నగజాత చరిత్ర మతి విచిత్రమైనది. పరమ పవిత్రమైనది. పాపహరమైనది. అట్టి మహాసాధ్వి చరిత్రమును సావధానుఁడవై యాలింపుము. అదిగో దక్షిణ దిశన సుదూరమున నీ కొండచివర నున్నత గోపురములతోఁ బ్రకాశించుచుఁ గన్పించుచున్నదే యధిష్ఠానపురవరము. ఆ పట్టణమును రాజ ధానిగాఁ జేసికొని మహామహిమాన్వితుఁడగు వసురాజు రాజ్య మేలుచుండును. ఆతని గుణము లెన్న వెయ్యినోళ్ళుగల యాది శేషునకును వశముకాదు. ఈ మహారాజు లోకాతీత పరాక్రమ వంతుఁడై ప్రజాహిత కార్యములఁ జేయుచుఁ బ్రసిద్ధికెక్కి యున్నాఁడు. ఈతని సుగుణజాలమునకు సురేశ్వరుఁడు నైతము సంతసించుచుండును. ఈ మహారాజు కీర్తియందుఁ బున్నమ చందురుఁడై, శౌర్యమ్మున సింగపుఁగొదమయై, రూపమున నల కూబరుఁడై, పరాక్రమమునఁ బాండవ మధ్యముఁడై, ధైర్య మున బంగరు కొండయై, దానమున సముద్రుఁడై వన్నె కెక్కి యుండెను.

దేవాంశసంభూతుఁడై యసమాన పరాక్రమవంతుఁడగు వసురా జొకనాఁడు దుష్ప్రవర్తనతో శుక్తిమతీ ప్రవాహ వేగము నాఁగఁజేసిన కోలాహలుని దన కాలి బొటనవ్రేలితో గప్పమీటిన రీతి నవలీలగ మీఁది కెగమీట నయ్యది యధిష్ఠానపురవర

సమీప ప్రదేశమునఁబడి దిక్కుతోచక దైన్యముతో, నుండెను. వసుభూపతి యద్దానిం గాంచి జాలిపూని తనకుఁ గ్రీడాపర్వతముగా నంగీకరించి దాని దైన్యముం బోకార్చెను. అటనుండి వసుమహారాజు ప్రతి దినము నా పర్వతముపై విహరించుచు నందలి యపూర్వ వస్తువులను గాంచి పరమానందమొందుచుండెను. ఇట్లుండఁ గొండొక కాలమునకు నాహ్లాదకరమైన వసంతసమయమావిర్భవించెను. అయ్యది సమస్త జంతుకోటి కానందదాయకమై ప్రకాశించుచుండెను. ఆ సమయమున వృక్షలతాగుల్మములన్నియుఁ జిగిర్చి, పుష్పించి చూపరులకు నయనపర్వం బొనరించుచుండెను.

అపు డుద్యానవనపాలకు లందుఁగల వింతవింత పుష్పములను, రుచికరములగు ఫలములను గొనివచ్చి రాజుమ్రోల నిడి, వసంత సౌందర్యమును వేనోళ్లఁ గొనియాడి యారామ వైభవములఁ జూడ విచ్చేయుఁడని రాజును వేడిరి. రాజు నకును నుద్యానవనశోభ తిలకింపఁ గోరిక లీరికలెత్త రథంబు తెమ్మని సూతున కాజ్ఞాపించెను. వెంటనే సూతుఁడు వేగముగా వెడలు గుఱ్ఱంబులం గట్టి యాయత్తపఱచిన పసిండియరదంబుం దెచ్చి గృహాంగణంబున నిల్ప, నా రాజచూడామణి యద్దాని నధిష్టించి మంత్రి సామంత పురోహితాదు లనుసరింప నందనోద్యాన సదృశంబగు నుపవనంబుఁ జేరం జని, వేత్రధరులు భళా యని హెచ్చరికలు సేయఁ దేరు డిగ్గి, పరివారము నచటనే నిల్పి, వేడుక చెలికాఁడు దారి చూప నుపవనంబుసొచ్చి యందలి వింత లారయుచుండెను. ఆ యుద్యానవన సమీపముననే శుక్తిమతి యను పుణ్యనది ప్రవహించుచుండెను. ఆ నదీతీరమున నొక

వృక్షము పుష్పఫలాదులతో నిండి యా నదిలోనికి వంగియుండెను. ఆ వృక్షాగ్రముననున్న యొక కిన్నరపక్షిమిధునము వసురా జనతి కాలములో ననుభవింపనున్న శుభమును దమభాషలోఁ జెప్పుకొనుచు నటనుండి వెడలిపోయెను. పక్షిభాష నెఱింగిన వసురాజు వాని పల్కులం దెలిసికొని వానిం బట్టుకొనఁ గుతూహలము గలవాఁడై యవి వెడలిన జాడనె సుదూరము వెడలెను. రాజు సమీపించునప్పటి కయ్యవి యదృశ్యములాయెను. అంత వసురాజు వానియం దాశను విడనాడి యా పర్వత సౌభాగ్యములఁ జూడఁ దలంపు గల్గి యందొకచోఁ గూర్చుండి యా పక్షులజంటను గూర్చియే విచారించుచుండెను. ఇంతలో నర్మసచివుఁడు రాజును వెదకుచు వచ్చి యచటఁ గాంచి 'మహారాజా! నీకొఱకు వెదకి వెదకి వేసారి తుదకిచ్చట నిన్ను జూడఁగల్గితిని. ఈ పర్వతమద్భుత విషయములతో నిండియున్నదికదా! నే నీ పర్వతమున నొక వింతం గాంచితిని. అదిగో! నా వ్రేలికి సూటిగ మీఁదికిఁ జూడుము. అటఁ గన్పట్టు నల్లమబ్బులలోఁ గొన్ని వృక్షములు కాన్పించుచున్నవి. అవియే కల్పవృక్షములుసుమా'యని నుడువగా విని, భూకాంతుఁ డా దిక్కునుగాంచి 'చెలికాడా! యెంత భ్రాంతిఁ జెందితివి? ఆ కన్పించునవి నల్లమబ్బులును, గల్పవృక్షములును గావు. నల్లగాఁ గన్పించునవి యింద్రనీలమణులతోఁ గూడిన పర్వతశిఖరములు. నీవు చెప్పిన కల్పవృక్షము లా పర్వతశిఖరము లందుండు వృక్షములే. ఓయీ! నీ కెప్పుడు నిట్టి భ్రాంతులే కల్గుచుండును. ఇఁక మన మీ పర్వతమందలి విశేషములం గాంచి వెడలుదము' అని పల్కుచుఁ జెలికానితో బయలుదేఱి యా పర్వతమందలి వింతలఁ జూచుచు నొక పొదరింటంజేరి, యందున్న

మరకత శిలాఫలకముపై విశ్రమించి, తాను గాంచిన వింతలను జెలికానితోఁ జెప్పుచు, నా వనమందలి సహజసౌందర్యమును గనులారఁ గాంచుచు నానంద మనుభవించుచుండెను. ఇట్లుండ నెటనుండియో యొక మధురనాదము వినఁబడెను. వసురా జా మధురధ్వని నాలించి, జనసంచారములేని యీ కాననమున నిట్టి మధురధ్వని విన్పించుటకు రా జాశ్చర్యమొంది చెలికానితో నిట్లు ముచ్చటింప నారంభించెను.

రాజు:—చెలికాఁడా! యీ వీచుచున్న చల్లనిగాలితోఁగలిసి చెవుల కింపుగా వినఁబడు మధురనాదమును నీవును వింటివికదా!

చెలి—నీ వెప్పుడు 'నది వింటివా? యిది వింటివా? అది చూచితివా? యిది చూచితివా?' యని యడుగుటతప్ప 'నీవు కడుపు నిండ మెసవితివా? తృప్తిఁజెందితివా? సుఖముగ నిద్రించితివా?' యని యేనాఁడును నడుగవు. పరాయితల్లి కన్నకొడుకు తినిననేమి? తినకున్ననేమి? నీ సంతోషమును మాత్రము నీవు చూచుకొనుచుందువు.

రాజు—సఖా! యీ మాటలకేమి గాని, నిజముగా నా మధుర నాదమును వింటివా? లేదా?

చెలి—ఔను వినియుంటిని. ఆహా! యా నాద మెంతయో మనోహరముగా నున్నయది. మహారాజు లెచ్చటి కేగిన నచ్చటనే మాధుర్యముఁ గ్రోలుచుందురుసుమా!

రాజు:—ఔరా! ఈ నాద మెద్దియో గాని, నా మనసున కెంతయో సంతసముఁ గల్గించుచున్నది. చెలికాఁడా! యియ్యది యాఁడు తుమ్మెదలఝంకృతియో, కలకంఠముల కూజితమో, యచ్చరమచ్చెకంటుల వీణానాదమో స్పష్టపడుచుము.

చెలి:—రాజా! యీ నాదమును బరికించిచూడఁగా నే యువతియో వీణియ మీటుచు, నద్దానితో మేళవించి గానము చేయుచున్నట్లు తోచుచున్నది. కాకున్న నిట్టి మాధుర్య మితరనాదముల కేల యబ్బును ?

రాజు:—చెలికాఁడా ! బాగుగఁ గనిపెట్టితివి. ఇది నిశ్చయముగా గంఠస్వరముతో మేళవించిన వీణానాదమే. ఈ నాద మాధుర్యముం గ్రోల మనంబు మఱి మఱి తొందరపడు చున్నది. ఈ గాన మెవరిచే నెటఁ జేయఁబడుచున్నదో తెలిసి కొనుటకు నా మన ముర్విళ్లూరుచున్నది.

చెలి:—రాజా ! తెలిసికొనుట యనఁగా నెంతపని? ఒక క్షణ కాలములోఁ గనుఁగొనివచ్చి చెప్పుదును. దీని కింత విచార మేల ?

రాజు:—చెలికాఁడా! నీ విపుడే బయలుదేఱి వెళ్లి గిరిగుహాలం దును, వృక్షవాటికలందును, దీఁగపొదలయందును, గోనల యందును వెదకి, దాని నిజస్థితిం గనుఁగొనిరమ్ము' అని నుడువ వేడుక చెలికాఁడు రాజాజ్ఞను శిరసావహించి యట నుండి వెడలిపోయెను.

# 4

వివిధ విద్యాకుశలుఁడగు సర్మసచివుఁడు రాజు నానతి ననుసరించి యటనుండి బయలుదేఱి, యరణ్య ప్రదేశముం జొచ్చి నలువిశలు పరికించి మధురనాద మేతెంచిన చాయనే యేగి యచ్చటి పూఁబొదరిండ్లను, ద్రాక్షతీవియలచే నల్లిబిల్లిగ నల్లు కొనిన పందిళ్ళను, మల్లెపొదలతో నిండిన ప్రదేశములను వెద కఁగా నొకకోన కాన్పించెను. అందుఁ జంద్రకాంతమణుల చఱి యలో పన్నీటి యే ఱొకటి ప్రవహించుచుండెను. ఆ యేటి కిరు ప్రక్కలఁ గర్పూరపుటనఁటులు, మామిళ్లు దట్టముగాఁ బెఱిగి యున్న తోఁట యొకటి కాన్పించెను. దాని నడుమ రాయంచల కలకలారావములతో నిండియున్న యొక సరోవరముండెను. ఇట్టి విశేషములం జూచుచు నా కోనలోఁ గొంత దూర మేగఁగా నొక ప్రదేశమున రత్నాల కాంతులతోఁ దళతళలాడు మణిమందిర మొకటి కన్పట్టెను. ఆ మందిరద్వారమునకు ముందు గున్న మామిళ్ళ దట్టముగ నలముకొనియుండెను. ఆ చెట్లసందునుండి చూడఁగా లోన నల్లని కురులతోను, తామరదుద్దుపలె బొద్దుతీరిన యునయనములతోను, నిద్దమైన మేనికాంతితోను, బున్నమచం దురుసింటోలు నెమ్మోముతోను, సందము మీఱియున్న యొక కన్నె చెలికత్తియతోఁగూడ నింద్రనీలమణి వేదికపైఁ గూర్చుండి వీణియ మీటుచుఁ గాన్పించెను.

అంత నా నర్మసచివుఁడు కలుముల జవరాలివి గాసుకై నఁ గొనని యా చెలువం గాంచి రాజున కీ వృత్తాంత మెఱింగింప నువ్విళ్లూరుచు నటనుండి వేగముగావచ్చి వసుధాపతిం గాంచి 'ఆర్యపుత్రా! నీ యానతినొదలం దాల్చి యీ గిరికాననమందలి యన్ని ప్రదేశములు వెదకి వేసారి తుద కొక కోనం గాంచితిని. అయ్యది వివిధ ఫలవృక్షములతోను, బూలతీవియలతోను గుబురుకొని రమ్యమై యొప్పుచుండెను. ఆ కోనయందుఁ జలువరాళ్ల పఱచిన మణిమందిర మొకటి కానవచ్చె. ఆ రత్నాల మేడలో సర్వాంగ సుందరి యగు నొక యువతి వీణ వాయించుచుండఁగాఁ గాంచి తిని. ఆ సుదతికి దేవ, గరుడ, గంధర్వ, కిన్నర కన్యకలలో నెవ్వరును సరిరారు. ఆ కోమలి దేహచ్ఛాయ మేలిమిబంగారము వలె మిసమిసలాడుచుండును. బ్రహ్మదేవుఁడు తన సృష్టిలో నీమెను సర్వోత్కృష్టముగా నిర్మించియుండెనుసుమా! ఆ సుంద రాంగి యవయవ సౌష్ఠవము వర్ణింపఁదరముకానిది. ఆ సుదతి మృదుభాషణ మమృతసరమువలె మధురమైయుండును. అట్టి లోకాతీత సౌందర్యవతియగు నా సుందరినిబడయ లోకోత్తర నాయకుడవైన నీవే తగుదువు కాని యితరు లర్హులుకారు. ఆ కొమ్మ దేవవనితలం దిరస్కరించు చెలికత్తియలతోఁగూడి యా సుందర మందిరమున నివసించుచుండును. ఆ మధురవాణి మణి సౌధములోని చలువఱాతి తిన్నెపైఁ గూర్చుండి వీణవాయించుచుఁ బాడుచుండఁగాఁ గల్గిన నాదమే గిరిగుహలయందుఁ బ్రతిధ్వనించి నదై మనకు వినవచ్చెను' అని యామె చరిత్రమును జవులూరు నట్లు వర్ణించిచెప్పెను.

వసురాజా నర్మసచివుఁడు చెప్పిన సుందరివృత్తాంతమును విన్నంతనే యా లేమను జూడఁ గుతూహలము కలవాఁడై యట నుండి బయలుదేఱి నర్మసచివుఁడు ముందు దారిచూప నా మణి మందిరమును సమీపించి మామిడి గున్నల మఱుఁగునఁ బొంచుండి కొమ్మలసందునుండి యప్పొలతిం గాంచి చెలికాఁడుచెప్పిన దానికంటె మిన్నగనుండుట కచ్చెరువొంది యట నిలువక చెలికానితోఁగూడ ననతిదూరముననున్న వనప్రదేశమున కేగి యందొక పొదరింటియందుఁ గూర్చుండి, యా సుందరి రూపమునే యెదఁ దలంచుచుఁ జిత్రప్రతిమరీతి నిశ్చేష్టుఁడై యుండెను. అపుడు చెలికాఁడు రాజుం గాంచి 'మహారాజా! యీ కాంతామణిని గాంచితివి కదా? నా నుడివిన పల్కులయం దసత్యమేమైనఁ గలదా?' యని యడిగెను. 'చెలికాఁడా! నీవు చెప్పినదంతయు నిక్కువమే. ఇఁక నా సుందరి వృత్తాంత మెఱింగి నా యిష్ట మీడేర్పవలసి యున్నది. ఆ కార్యము నిర్వహించుటకు నీవే సమర్థుఁడవు. నా యిష్టము నెఱవేర్చుటలో నీకంటె నితరుఁడు నాకుఁ గలుగఁ డనుట నిక్కువము. ఎట్టి కార్యనిర్వహణముఁ గావింతువో, యేపగిది నా యభిమతముం దీర్తువో యదియంతయు నీపైననే కలదు. చెలికాఁడా! పాలముంచినను, నీటముంచినను నీవే సుమా' యనుచు బహుభంగులఁ బ్రార్థించెను.

అంత నర్మసచివుఁడు రాజుం గాంచి 'మహారాజా! మీరు నన్నింతగఁ బ్రతిమిలాడఁ బనియేమి? మీ వేడుక చెలికాఁడ నగు నేను మీకు వేడుకలు కూర్చుటకన్న చేయు మహాకార్యమేమి కలదు? మీ రానందించిననే నా కానందమగుట మీ రెఱుఁగని విషయముకాదు. ఈ సంగతి మీ రెఱిఁగియు నీవిధముగాఁ బల్కుట

నన్ను వంచించుటయే యగునుసుమా! ఔను. రాజుల కిది నైజ గుణము కాఁబోలు. అవసర సమయములయందుఁ దలపై నిడుకొనుట, అవసరము తీరినపిదపఁ గ్రిందఁబడఁ ద్రోయుట పాలకులకుఁ బరిపాటియే. ఇఁక నిప్పుడు మీరు నన్ను బొగడుటలో విచిత్రమేమి?' యని యెత్తిపొడిచెను. ఆ మాట లాలించిన భూపతి 'వయస్యా! నే నా రీతిఁ బ్రవర్తించువాఁడనేనా? అందును నీ విషయములో నెప్పుడైన నట్లు చేసియుంటినా? ఏల యీరీతి నన్ను నిందింతువు? చాలుఁ జాలు. ఈ మాటలకేమికాని శీఘ్రముగాఁ గార్యనిర్వహణమునకుఁ బూనుకొనుము. ఇట్టిమాటలతోఁ గాలయాపనచేసి నన్నేల బాధించెదవు? జాగుసేయక యనువైన యుపాయముం దెల్పి నను ధన్యుంజేయు'మని వేడుకొనెను. చెలికాఁడు 'మహారాజా! ఇప్పుడె నా నేర్పంతయుఁ జూపి లోకపూజ్యమైన మునివేషమును ధరించి యా యువతి యుండు ప్రదేశమునకు వెడలి యాపె చెలికత్తియలవలన సర్వమును దెలిసికొని వచ్చెద చూడు' మని పల్కెను. ఆ పలుకులకు రాజపరిమితానందభరితుఁడై 'సఖా! నీ మాటలు మిగుల సంతసమును జేకూర్చుచున్నయవి. కాని నీవు మునివేష మెట్లు దాల్తువో, వారికడ నేర్పుమీఱ నెట్లు ప్రసంగింతువో, మిత్ర మనోరథ మే తీరునఁ దీర్తువో యిపుడు చూడవలసియున్నది. జాగుసేయక వెడలు'మని యాజ్ఞాపింప నాతఁడు వెంటనే చెట్లచాటున కేగి యా కాననమందలి కల్పవృక్షముల ప్రభావముచేఁ దీఁగగుంపులు జడలుగను, బుప్పొడి విభూతిగను, వృక్షశాఖ యోగదండముగను, లేఁజివుళ్లు కాషాయవస్త్రములుగను, గోరకము లక్షమాలికలుగను నాఁగా యోగియై, భూనాథుఁ డబ్బురపడున ట్లెదుటఁ బ్రత్యక్షమాయెను. మునివేష

మచ్చుపడియుండుట కాంచి రాజచూడామణి యీ కార్యము గట్టె క్కినట్లుగ భావించి లోలోన ముసిముసినవ్వులు నవ్వుచు 'ప్రియ వయస్యా! నీ నైపుణ్యము వచింపరానిది. ఈ వేషధారణమువలన నాకు గల్గిన సందియము లన్నియుఁ దీరినవి. ఇఁకఁ జాగుసేయక వెడలుము. నీకుఁ గార్యము సిద్ధించుగాత'మని దీవించి పంపెను.

# 5

"నే నీ వేషముతోనే నా మిత్రమనోరథ మీడేర్పవలసి యున్నది. ఆ సుందరాంగులయెదుట సమయోచితముగ మాట లాడి నా నేర్పంతయుఁ జూపి వారి వృత్తాంత మెఱుంగవలెను. నా నిజరూపము వారికి గోచరింపకుండ ప్రవర్తించవలెను, రాజు నకు వారి కలయిక చేకూర్చవలెను. నన్ను వారు గుర్తించిరేని నా పడిన శ్రమయంతయు విఫలమగును.వసుభూపతి కోర్కె వ్యర్థ మగును. నేఁ బొందనున్న బహుమానము సున్నయగును. అపుడు నాకు వేడుక చెలికాఁడను నామము నిరర్థకమగును. అబ్బా! అతి భారమగు కార్యము తలపైఁ బడినది. ఎట్లీ కార్యము నెరవేర్పఁ గలుగుదునో కదా" యని విచారించుచు నర్మసచివుఁడొక చోటఁ గూర్చుండియుండెను. ఈ రీతిఁ గొంతతడ వాలోచించి చేయవల సిన పనులను, ప్రవర్తింపవలసిన రీతులను మనమున నిశ్చయించు కొనినవాఁడై యటనుండి లేచి మెలమెల్లగా నా సన్నుతాంగి మందిరమును సమీపించి యక్షసరముం ద్రిప్పుచుఁ, గనులు మూయుచు రామనామ స్మరణఁ జేయుచుఁ జెట్టిమఱుగున నిలచి లోనఁ బ్రవేశించు సమయమున కెదురుచూచుచుండెను.

ఆ సమయమున మణిసౌధములో సఖీజన పరివేష్టిత యైన నగజాత గాన మాపినంతనే యొక చెలికత్తియ దగ్గరి 'సఖీ! నీ వీణాగానము నారద, తుంబురుల వీణాగానమును సైతము తలఁ దన్నుచున్నదనుట నిక్కువము. పద్య ప్రబంధములలో

యతి కూడివచ్చుట సహజముకాని. గీతప్రబంధములలో యతి కూడివచ్చుట వింతకాదే!' యని మెచ్చుకొనుచు నామె చేతినుండి వీణియను గ్రహించి యా వేదికమీఁదనే యొకచోట నుంచెను.

సమయమునకై వేచియున్న కపటయతియు లోనఁ బ్రవేశించుట కిదియ యదనని నిశ్చయించుకొని 'రామ, రామ' యనుచుఁ జెట్లమాటునుండి వీడి ద్వారముకడ కేగి 'బాలికామణీ! నీ వాడిన మాటకు మెచ్చుకొంటిని. యతివచ్చు జాడ నేరీతి గుర్తెఱింగితివి? మీ సభ గానామృతమును జవిచూచిన వారామెకు దీవన లొసఁగక యె ట్లూరక వెడలఁగలరు? అనుచు సంకల్పమునఁ గల్పుకొని వచ్చుచు ద్వారమును దాటి లోనం బ్రవేశించెను.

అచ్చటి యువతులెల్లరు యతిరాక కచ్చెరువొంది తొందర పాటుతోఁ దమతమ యాసనములనుండి దిగి యొకరి నొకరు చూచుకొనుచు వెఱఁగుపడుచు వినయముతో నిలచి కాంచుచుండఁగనే యా మునిపుంగవుఁడు వారిని సమీపించెను. అంత వారెల్లరు నమస్కరించి నిలచియుండ నా ముని 'లావణ్య ప్రభావ సుపల్లభం బెండ్లియాడు'మని నగజాతను దీవించి వా రిడిన గద్దియపైఁ గూర్చుండి వారినిగూడఁ జేసైగచే నాసనములధిష్ఠింప నాజ్ఞ యిడెను. ముని యనుమతి నొవలందాల్చి వా రెల్లరు నుచితాసనము లలంకరించిరి.

వేడుకచెలికాఁడు మునివేషమును ధరించి కార్యనిర్వహణమునకు వెడలిన పిదప వసుమహారాజును నాతఁడెట్టి నైపుణ్యముతోఁ గార్యము నిర్వహించునో, సందర్భానుసారముగ నెట్లు సంభాషించునో, సమయానుకూలముగ నెట్లు ప్రవర్తించునో,

యచట నెట్టి సంభాషణముఁ జేయునో ప్రత్యక్షముగఁ దెలిసికొనఁ గోరి తాను వెంటనే బయలుదేఱి యా మందిర సమీపమున కేగి గృహద్వారమున కెదురుగా మామిడిగున్నలచే దట్టముగా నల్లుకొనియున్న పొదమాటున నిలచి యా చెట్లకొమ్మల సందు నుండి తొంగిచూచుచుండెను. చెలికాఁడు నేర్పుతో సందర్భమును గల్పుకొని లోనఁ బ్రవేశించుట కబ్బురపడుచు, నా సుందరాంగి సౌందర్యముం జూచి తన్మయుఁడగుచు, నా పొలఁతిపొందున కాతురతపడుచు నచటనే నిలచియుండెను.

అపుడు సమయోచిత సంభాషణమం దారితేరిన మంజు వాణియను చెలికత్తె లేచినిలచి మోసెలొగ్గి వినయముతో 'ముని సత్తమ! మీ రెచటినుండి యెచటి కేగుచు నిచటికి విచ్చేసి యుంటిరి? మీ రాకవలన మా సఖికిఁ గల్గిన భాగ్య మింద్రుని రాణి వాసమునకైన లభింపదని తలఁచెద. మీబోఁటి మహనీయులు వచ్చుట మహావిశేషమని చెప్పఁదగియున్నది. నిర్మలములై ప్రశాంతములైన మీ యాశ్రమములకును, పాపములకుఁ దావల ములైన మా గృహములకును హస్తిమశకాంతర మెడము కలదు. ఆశలన్నిటిని దిగనాడిన మీకు గ్రామములో నివసించువారితోఁ బనియేమి? మాయందు నిర్వ్యాజమైన కృపారసము కలుగుట చేతనే యీనాఁడు మా గృహమునకు విచ్చేసియుంటిరి. మీ రాకవలన మా గృహము పావనమైనది. మా జన్మలు సఫలము లైనవి. పూర్వజన్మ సుకృతమువలనఁగాక యితరముగ మీ దర్శన భాగ్యము మా కెట్లు లభించును? మా సకియ వీణానాదమునకు మెచ్చి విచ్చేసిన యల నారదమహర్షులే మీరు కానోపుదురు. మహాత్మా! మీ కృపారస మెంతయని కొనియాడఁగలము? మే

మడుగుట దోషముకాదేని, చెప్పుట కిష్టపడుదురేని తమ పవిత్ర నామాక్షరములం దెల్పి మాకుఁ గర్ణరసాయనముఁ గావించి మమ్ముల ధన్యులం జేయుఁడు' అని యుచితరీతి యతికుంజరు ననేక విధములఁ బ్రార్థించెను.

అపు డామెమాటలకు ముని సంతసించి 'ఓ యువతీ! యీ భూమండలమునఁ బ్రసిద్ధనామధేయుఁడైన గౌతముఁడను మునివర్యుని వినియుంటిరిగదా? ఆ మహానీయుని వంశమున జన్మించి గౌతమనామముననే ధరించి నియమనిష్ఠలతో వసు నాధుని భజించి వాని మంత్రమునే చక్కఁగా జపించుచు ముని మార్గ మవలంబించి సర్వదా వాని పాదసేవానిరతుఁడనై యుంటిని. అందుల కా మహానీయుఁడు మెచ్చుకొని యన్ని స్థానములయందును దనవెంటఁ దిరుగు ప్రభావము ననుగ్రహించెను. ఆ కారణము వలన నెట్టి గహన ప్రదేశమునకైన రా సమర్థతగలవాఁడనై యెల్ల చోట్లం గ్రుమ్మరుచు నీ నాఁ డిట కేగుదెంచితి'నని తన స్వామి వృత్తాంతమంతయు వెల్లడియగునట్లు తన యితివృత్తము దెల్పి 'వనితా! యనుపమభాగ్యలక్షణములతోఁగూడిన మీ సఖిని జూడఁ గలుముల జవరాలో, శివుని యర్ధాంగలక్ష్మియో, పలు కుల వెలందియో యనుభ్రాంతి పొడముచున్నది. ఈమె కులగోత్ర నామములం దెల్పి నా మనోరథ మీడేర్ప నిష్టమేని యట్లు గావింపు' మనుచు హెచ్చరించెను.

ఉచితమగురీతి మాట్లాడుటయందేకాక, యితరుల మన స్సును గనిపెట్టుట యందును నిపుణురాలైన మంజువాణి యా వంచనాయతి సాభిప్రాయ వాక్యములలోని భావగాంభీర్యమును జక్కఁగఁ గనిపెట్టి యిప్పట్టున తమ సఖీవృత్తాంతమును జెప్పుట

యుచితముగభావించి నగజాతదెస చూడ నామె యంగీకారసూచక మందహాసంబుఁ గావించెను. అద్దానితోనే యామె యభిప్రాయ మూహించి మంజువాణి వినయముతోఁ బ్రియసఖివృత్తాంతమును జెప్ప నీయకొని "మహాత్మా! మీరు సమస్తలోకభరణుఁడైన వసు నాధుని గొల్చియుండుట కతన మీకీ యఖిల ప్రపంచకథలు తెలిసియుండుట తథ్యము. అట్లు తెలిసియు మఱిమఱి యడుగుట మాయందలి ప్రేమాతిశయముచేతనే యని భావించి యీామె పావన జననక్రమమును విన్నవించుచున్నదాన. సావధానమతు లరై యా కర్ణింపుఁడు.

# 6

సమస్త సంపదలకు నిలయమై, పుణ్యములకుఁ బుట్టుక భూమియై, సుజనకోటికి నునికిపట్టై వెలుగొందు భారతభూమి యందు వసుమహారాజు వసుధారమణుఁడై వాసిఁగాంచుచుం డును. ఇంద్రున కమరావతి పట్టణమువలెను, కాలకంఠునకుఁ గైలాసమువలెను, విష్ణుదేవునకు వైకుంఠమువలెను, నీ మహా రాజున కధిష్ఠానపురము రాజధాని నగరము కాఁగా నా మహారాజు నిత్యసంపదలతోఁ దులఁతూఁగుచుండును. ఆ రాజధానికి సమీపమున శుక్తిమతియను నది నిర్మలమగు నీరములు కలదియై ప్రవహించుచుండును. ఆ నదియొక్క సోయగము చెప్పందరము గాకయుండును. ఆ నదీమతల్లి యనుదినము నలువకొలువునకేగి యా నలుమొగంబుల వేల్పుం గొల్చి వచ్చుచుండును. ఇట్లుండ నొకనాఁడు యథారీతి బ్రహ్మదేవునకు సేవలొనర్చి యొంటరిగ వచ్చుచుండ, నున్నత శిఖరములు గల్గిన కోలాహలమను పర్వత రాజు హిరణ్యగర్భుని కొలువున కేగుచు దారిలో నామె కెదు రయ్యెను. సాటిలేని మేటిభోగముల ననుభవించు హిమవంతున కనుంగు పుత్రుఁడై, లోకమాతయగు పార్వతికిఁగూరిమి తమ్ముఁడై, లోకవశంకరుఁడగు శంకరునకు ముద్దుల మఱందియైన కోలాహలుని గాంచి శుక్తిమతి భక్తితో వానిం భజించి వినయముతో నొదిఁగి వెడలిపోయెను. ఆమెను గాంచి

నంతనే కోలాహలుఁడు తన సహజధైర్యమును విడనాడి యామె సౌందర్యమునే మనమునఁ దలంచుచుఁ బద్మజు పేరోలగమునకు వెడలి యా నలువకు నతులు సల్పి యట నుండ మనసొప్పక వెంటనే తన యిరవున కేగుదెంచెను. అప్పటినుండియు నీమె యందలి కూర్మి పేర్మిచే నోర్మి యంతరింప మదనానల సంతప్తుఁడై యామె రూపమునే తన మనమునఁ దలంచుచుఁ జింతాక్రాంతుఁడై క్షణ మొకయుగముగఁ గాలముపుచ్చుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు కోలాహలుఁ డామెపైఁగల మక్కువ నాపుకొనఁజాలక సర్వాభరణభూషితుఁడై మేనఁ జందన మలంది శుక్తిమతిని సమీపించెను. అపు డామె సవినయముగ వాని నుచిత రీతిఁ బూజించి, యర్ఘ్యాసనమున నుపవిష్టుంజేసి యిట్లు నుడువ నారంభించెను.

శుక్తి:—మహాత్మా! సర్వసంపదలతోఁ దులఁదూఁగు మీకు నావలనఁ గాఁదగిన ప్రయోజనము లెవ్వియు లేవనుట కల్ల గాదు. అట్టితటి మీ రిచటి కేతెంచుట నాపై గల యభిమానము కాక వేరేమియుఁగాదనుట నిక్కువము. అట్టి మీ యవ్యాజ ప్రేమ నేమని కొనియాడుదాన?

కోలా:—బాలికామణీ! నీ వాడినమాటలు నిక్కువములు. నీ మీఁదిప్రేమయే నా యీ రాకకుఁ గారణము. నీ వలనాడు బ్రహ్మదేవుని సేవించి తిరిగి వచ్చుచుండ దారిలో నిన్ను గాంచినప్పటినుండియు నీపైఁ బ్రేమ జనించి న న్నెంతయో బాధింప నారంభించెను. ఆ బాధకుఁ దాళఁజాలక నీ దర్శనమునకు వచ్చియుంటిని.

శు_క్తి:—పూజ్యులగు తమ రీ రీతి నన్యవనితలపై వలపుగొనియుం డుట తగవగునా?

కోలా:—అబలా! యిందుఁ దగవుకాని దేమి కలదు? బ్రహ్మ దేవుని కొలువున కెందఱు దేవతా వనితలు వచ్చుటలేదు? ఎందఱ నెన్నిమార్లు దర్శింపలేదు? వా రందఱిపై నా కిట్టి కూర్మి జనించినదా? నీపై నిట్టి ప్రేమ జనించుట చూడ నిది పూర్వజన్మకృతమై యుండనోపు. ఇది తగవుకాదని తగవులా డక నన్ను మన్నించి నా ప్రార్థన నాలింపుము.

శు_క్తి:—ఆహా! నీ వింతటి యవివేకివి, కామాంధుఁడవునని తెలి యక నిన్ను బూజించి నీతో మాట్లాడుట కిచ్చగించితిని. చాలుఁజాలు. ఇటనుండి వచ్చినదారిన వెడలుము.

కోలా:—సుదతీ! నిర్దయురాలవై యిట్లు పల్కుట యుచితమా? ఒకపరి కన్నెత్తి చూడుము. నోరాడ మాట్లాడుము. నాపై నావంతయైనఁ గనికరముంచుము. కాంతామణీ! ఎంతటి పరితాపముతో నీప్రాపుఁ జొచ్చితినో గమనింపకుంటి వేల? ఈనాటితో నా జీవితము నీ కర్పించినాఁడ. పాలముంచినను, నీటముంచినను నీదే భారము. నిన్ను విడనాడి క్షణకాలమైన నిలువఁజాల. కనికరించి కాపాడుము.

శు_క్తి:—(తనలో) మంచిమాటలతోఁ జెప్పి జూతునుగాక. (ప్రకాశ మున) పర్వతరాజకుమారా! ఉత్తమవంశమునజన్మించిన మీరు నాబోఁటి యల్పురాలిని బ్రేమించుట యధర్మముకాదా? ప్రేమకు స్థానాస్థానము లుండనక్కరలేదా? నేను మీయందు దైవభావముతో నుండ మీరు నాపైఁ బ్రేమభావముతో నుండుట యనుచితము కాదే? కులగౌరవమునైనఁ బాటింప

నక్కరలేదా? ఇతరుల మనసులం బరికింపక స్త్రీలను జూచి నంతనే ప్రేమించుట పాడియా? ఆర్యా! ఈ సాహస కార్యము గట్టిపెట్టి సరగున వెడలుము.

కోలా:—నదీలలామా! నేను నీ ప్రేమ ప్రవాహములో మునిఁగి యతిదీనముగా వేడ నీ విట్లు గట్టి పల్కులు పల్కుట ధర్మమేనా? మాకుండవలసెన కాఠిన్యము నీ కేల యబ్బినది? సుందరీ! యీ గట్టితనమును వదలి యీ దీను నేలుకొనుము.

శక్తి:—పర్వతరాజమా! మీ తండ్రియగు హిమవంతుని యొక్కయు, సోదరుఁడగు మైనాకునియొక్కయు గొప్పతనమును గొంచెమైన జూడకుంటివేల? తుదకు వనరాశిపాలగు వనితను పలచుట కేల యిచ్చగించితివి? మీరు పరిణయమాడ దలచిఁన నీ విశాల ప్రపంచమున నెందఱు రాచకన్నియలు లేరు? మిమ్ముఁ జూచి ప్రేమించు దేవతావనిత లెందఱు లేరు? వారిని గాదని కాలునిలకడలేని నన్ను బ్రేమించుట కన్న హీనమైన కార్యమెద్ది? నదులను బ్రేమించి యెట్టి సుఖములను బడయఁజాలుదువు? ఆర్యా! యిట్టి వ్యర్థప్రయత్నమును జాలింపుము.

కోలా:—సుందరీ! యీరీతి నదీలలామలం గామించినది నే నొక్కడనేకాదు. పూర్వ మెందఱో రాజులు, ఎందఱో మహాత్ములు నదీమతల్లులను గామించి యిష్టసుఖములను బడయలేదా? ఆకాశగంగను నౌదలం దాల్చిన మహేశ్వరున కేమి లోటు కల్గెను? కాళిందిని బరిణయమాడిన శ్రీ కృష్ణున కెట్టి యవమానము వాటిల్లెను? జాహ్నవిం జేపట్టిన శంతనుని సంతసమునకు సుంతయైనఁ గొదువ కలిగెనే? నదుల నేలిన రత్నాకరున

కేమి న్యూనత వాటిల్లెను? వనితా! యిట్టి కొంటమాలిన సందియములు పెట్టుకొనక, నా ప్రార్థనఁ ద్రోసిపుచ్చక నాకుఁ బ్రాణదానము చేయుము.

కాంతామణీ! స్థానాస్థానములు విచారించమనియు, నెందఱో రాచకన్నియలుండ నన్ను బ్రేమించుట మర్యాద కాదనియు నేమేమో నోటికివచ్చిన నీతులను వల్లెవేసితివి. ప్రేమ యెచట జనించునో యది యే స్థాన మనియుఁ బ్రేమ జనింపకున్న నెంతటి యుత్తమ ప్రదేశమైనను స్థానము కాదనియు నెఱుంగుము. ప్రేమయే జనింపకున్న రాచకన్నియలతో నేమి? దేవకన్నియలతో నేమి? ఈ రీతి వ్యర్థప్రసంగములు చేసి నన్ను మోసగింప యత్నింపకుము. నీయం దెంతటి మక్కువ గల్గి యీరీతిఁ బ్రార్థించితినో యెఱుఁగకపోతివిగదా! సుందరీ! నీ విట్లు పల్కుట నాపైఁ బ్రేమలేకకాదు. నా మనమును గనిపెట్టుటకేనని తలచుచున్నాఁడ.ఇఁక దీర్ఘకాలము నన్నేపక ప్రోవుము. నా మొఱ లాలింపుము.' అని పల్కుచు నాపె తరంగహస్తములు బట్టి బ్రార్థింపఁ దొడంగెను.

అతఁడు తనహస్తములను బట్టుటకు శక్తిమతి కినుక వహించి "ఛీ! తులువా! దూరముగా నుండుము?" అని పల్కుచుఁ దత్తరపాటుతో చేతులు విదల్చుకొని యట నిలువక వేగముగా వెడలనారంభించెను. అపు డాతఁడు దాని దిట్టతనముంగాంచి 'ఔరా! మంచిమాటలతో నెంతగ వేడికొన్నను గొసంతయుఁ గనికరము జూపక చేతులు విదల్చుకొని వెడలిపోవుచున్నది. ఇఁక నిట్టి మాటలతోఁ బ్రయోజన మిసుమంతయుఁగాన్పింపదు;' అని తలఁచి వెంటనే యా శక్తిమతి మార్గము నడ్డగించెను. అందుల కా

నదీలలామ భీతిల్లి, యేమిచేయుటకును దోచక, యెటు పోవుట కును దిక్కుగానక కలఁతఁజెంది దిక్కులు బ్రద్దలగునట్లు వాపో వుచు ముందుకు వెడలుటకును, వెనుకకు మఱలుటకును దోచక పొంగి, పొరలి దేశమంతటిని జలమయముగావించెను.

అందులకుఁ బ్రజలెల్లరు భయభ్రాంతులై నిలువనీడలేక చెట్లెక్కియు, గట్లెక్కియుఁ బ్రాణములను గాపాడుకొనుటకుఁ బరుగులిడుచుండిరి. పంటపొలము లన్నియు నీటఁ మునిగిపో యెను. ఇట్టి భయంకర ప్రళయమునకుఁ బౌరులు భీతాత్ములై కొందఱు గుమికూడి రక్షింప వేడుటకై వసుమహారాజుకడకు వచ్చి, తమ యిక్కట్టుల నిట్లు విన్నవింప నారంభించిరి. "దేవరా! మీరు పరిపాలించుచున్న యీ దేశమున నగ్నిహోత్రుఁడు నైతము గృహదహనాది దుష్కార్యములు చేయ వెఱచుచుండును. వాయు దేవుఁ డనుకూలగతి వీచుచుండునేకాని భయంకరముగ వీచి లోక మున కపకారము చేసి యెఱుఁగడు. సూర్యుఁ డంధకారము నణఁ పఁదగు కాంతితో వెలుఁగుచుండునేకాని యెండవేడిమిని జూపి జంతుసంతతికిఁ దాపముఁ గలిగించి యెఱుగఁడు. మేఘములు సన్యోపయుక్తముగ వర్షించుచుండునేకాని యతివృష్టి బాధను గలి గింపవయ్యె. ఈరీతి భూతము లన్నియు ననుకూలముగఁ బ్రవర్తిం చుచుండుటచే దేశము పాఁడిపంటలతో నిండియుండుట సంభ వించినది. అక్కారణమున మే మింతవఱ కెట్టి కష్టముల నెఱుఁగక సుఖములలోఁ దేలియాడుచుంటిమి. ఏమి దురదృష్టమోకాని యీ నాఁడు సంప్రాప్తమైన యుపద్రవము చెప్ప నలవిగాకయున్నది. భూనాధా! యెక్కడనుండియో యొక కొండ వచ్చి మన పట్టణసమీ

పమునఁ బ్రవహించుచు, దేశమున కన్ని విధముల మేలు చేకూర్చుచుండు శుక్తిమతీనది కడ్డముగా దుమికెను. ప్రవాహవేగమునకుఁ బెద్దకొండ యడ్డమువచ్చుటచే నా నది ముందుకుఁ బోవ దారిఁగానక వెన్కకు ప్రవహింపనారంభించెను. అందువలన గల్గిన పెద్ద వెల్లువ మఱలి గ్రామములను, భూములను నాక్రమించి ధ్వంసముచేయ మొదలిడెను. ఆ వెల్లువకు మా కొంపలన్నియుఁ గూలిపోయినవి. ఎన్నియో పశువులును, ఎందరో జనులును హతులై పోయిరి. తమను దర్శించు భాగ్య ముండుటవలన మే మెట్లో యీ విప్లవమును దప్పించుకొని తమకడకు వచ్చితిమి. ఆలు మగలకు, తల్లి బిడ్డలకు నెడఁబాటు కల్గించుచున్న యీప్రళయమునుండి యీ దీనప్రజలను రక్షింపు దేవా" యనుచు దీనులై వేడుకొనిరి.

వారి మొఱ లాలించిన వసుమహారాజు తన ప్రజలకు సంభవించిన యిక్కట్టులకు మిగుల వగచుచు వారిం గాపాడఁ గృత నిశ్చయుఁడై 'ప్రజలారా! భయపడకుఁడు. ఈ క్షణమే మిమ్ముల నాపదనుండి కాపాడుదును. మీ మీ నిలయంబులకు మీరు వెడలుఁడు' అని వారిని ననిపి వెనువెంటనే పరిమిత పరివారముతో నా ప్రదేశమునకు వెడలి భయంకర దృశ్యమును గనులారఁ గాంచి సంభ్రమాశ్చర్య క్రోధములు ముప్పిరిఁగొన నా కోలాహలుని దుర్వృత్తమును దొలఁగఁద్రోయ నిశ్చయించి, శ్రీరామచంద్రుఁడు దుందుభి కబంధమును మీటిన పగిది యా కొండను దన కాలి బొటనవ్రేలితో నెగమీటెను. ఆ మీటున కప్పర్వత మెగిరి సుదూరమునఁ బడి భీతిచే నటనే కదలక మెదలకయుండెను. పర్వతముయొక్క యాటంకము తీరుటచే నా నది

యథారీతిగఁ బ్రవహింపసాగెను. క్రమక్రమముగా వెల్లువయుఁ దగ్గ నారంభించెను. ప్రజ లెల్లరుఁ దమ యేలిక ననేకవిధముల నుతించిరి. అంతట రాజచూడామణి పరివారము వెంట రాఁ దన పట్టణమునకు వెడలెను. ఇట్టి యమానుషకార్యములు గావింప దేవాంశసంభూతులకుఁ దప్ప సామాన్యులకు వశమగునా?

# 7

వాసవుఁడు వసుభూపతి పరాక్రమమును గని ముదము మీఱఁ బుష్పవర్షముం గురిపించి సురదుందుభులు మ్రోగుచుండ విమానాధిరూఢుఁడై భూలోకమున కవతరించి వసురాజుకడకు విచ్చేయఁగా నా రా జెదురేగి యర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి నమస్కరించి తన గృహమునకుం గొనివచ్చి యుచితాసనాసీనుం జేసెను. అంత నింద్రుఁ డాతని వినయాది సద్గుణముల కబ్బుర పడుచు నా మహారాజు ననేక విధముల నుతించి "వసురాజా! యింతదనుక పెక్కండ్రు రాజచూడామణులం గాంచియుంటిని; కాని నీవంటి యపూర్వశక్తిమంతుని, లోకరక్షణ విచక్షణుని గాంచి యెఱుఁగను. ఇట్టి దుష్కార్యముల నాచరించు పర్వతముల యున్నతి నణఁచుటలో నా వజ్రాయుధముకంటె నీ పదాంగుష్ఠమే యగ్రగణ్యమైనది. పుష్పమునకుఁ దావి యబ్బినట్లు నీ శౌర్యమునకు వినయాది సద్గుణంబులు తోడై యుండుట ప్రశంసనీయమై యున్నది. రాజచూడామణీ! నీ శౌర్య సాహసాది సద్గుణంబులకు మెచ్చుకొంటిని. ఈనాఁటినుండి నీవు నాతో మిత్రభావము వహించియుండుము. మేము కోరినపుడెల్ల మా లోకమునకు వచ్చుచుఁ బోవుచుండుము. మా కవసరమైనపుడు వచ్చి సహాయ మాచరించుచుండునది. నీ వన్ని లోకములు తిరుగుట కనువగు నీ దివ్యవిమానము నీకుఁ గానుకగా నొసంగుదును. కైకొనుము. ఈ విమానరాజమును లక్ష్మీ

దేవి పెండ్లినాఁడు విశ్వకర్మచే శ్రీ మహావిష్ణువునకొసంగఁబడెను. ఈ విమానముమీఁదనే యాదిదేవుఁడు లక్ష్మీసమేతుఁడై విహరించుచు నొకనాఁడు దేవలోకమునకు వచ్చెను. నే నా విమాన శోభను దిలకించి దానియం దధికప్రేమ కలవాఁడనై నిశ్చల దృష్టితో దానినే చూచుచుంటిని. విష్ణుమూర్తి చూపులవలననే నా మనోగతభావ మెఱింగి యీ దివ్యవిమానమును నా కొసఁగి వెడలెను. నే నా విమానముమీఁదనే లోకములన్నియు సంచరించుచుంటిని. ఈనాఁడు నీ శౌర్య సాహసాదులకు మెచ్చుకొని యిద్దానిని నీ కొసంగుచున్నాఁడ, గ్రహింపుము. ఈ విమానము యొక్క ప్రభావము కొనియాఁడదగినది. అద్దానిం జెప్పెద నాలింపుము.

"ఈ విమానము ప్రతినిత్యము మిక్కుటముగ మేలిమి బంగారము నొసంగుచు సర్వసుఖముల నొడఁగూర్చుచుండును. ఈ ప్రభావము దీనికి విశ్వకర్మచేతనే కల్పింపఁబడినది. మఱియు నియ్యది విచిత్ర రత్నరాసులతోఁ బ్రకాశించుచు నేత్రానందమును గలుగఁజేయుచుండును. మిసమిసలుదేలు పసిఁడితో నిర్మింపబడినదై సంతోషము నొసంగుచుండును. వసుమహారాజా! దీని మహిమ వర్ణింప నలవికానిది. ఆనందమునకు నిలయమైన యీ విమానముతోఁ గుబేరుని పుష్పక విమానముకూడ సాటి రాదు. ఇయ్యది పద్మరాగమణిమందిరములతోఁ గూడి శిశిరర్తువు నందలి యానందమును జేకూర్చుచుండును. నవనవలాడుచుఁ జలువలను వెదజల్లు లతాగృహములతోఁగూడి వసంతర్తువు నందలి యామోద మొదఁగూర్చుచుండును. ముత్యములు కూర్చి యుండుటచే గ్రీష్మర్తువునందలి యుల్లాసమును గలుగఁజేయుచుం

డును. వజ్రనిర్మితమై ప్రకాశించుచు వర్షర్తువునందలి సంతస మును గలిగించుచుండును. వివిధ రత్నజాలముతోఁ గూడినదియై హేమంత, శరదృతువులయందలి సౌఖ్య మాపాదింపఁజేయును. ఈ విమానమునఁ జెక్కఁబడియున్న సిద్ధసాధ్య కిన్నరాంగనల ప్రతిమలు కోరినంతనే నిజరూపములు ధరించి నృత్యగానములు సల్పుచు మహదానందమును గలుగఁజేయుచుండును. ఇట్టి విమానరాజము నెక్క బ్రహ్మ విష్ణు మహేశ్వరులుతప్ప నన్యుల కర్హముకాదు. శ్రీ మహావిష్ణువు ననుగ్రహమువలన నట్టి శక్తి నాకు సంక్రమించినది. ఇపు డా యధికారమును నీ కొసంగి యుంటిని. అందువలన నీ వీ విమానరాజము నధిష్ఠింప నర్హుండ వైతివి. ఇఁకనుండి యద్దాని నధిరోహించి స్వర్గాది లోకంబు లను, నదీనదంబులను, సమస్త పర్వతములను, నెల్ల ద్వీపంబు లను వీక్షించుచుండు"మని దాని ప్రాప్తియు, మహిమాతిశయం బును జెప్పి "వసుమహారాజా! యిటనుండి మా వీఁటికి రాకపో కలు సల్పుచుండు"మని ప్రార్థించి వెడలిపోయెను.

వసుభూపతియు నాఁటినుండి యా విమానరాజం బెక్కి యాకసమున విహరింపఁదొడంగెను. ఆరీతి విమాన సంచారి యగుటచే నచటి తాపసులెల్ల రీ భూనాథున కుపరిచరవసుఁడను నామకరణం బొసర్చిరి. ప్రతినిత్య మా విమాన మిచ్చు సువర్ణ మును భూసురులకు దానముచేయుచు దానకర్ణుఁడని వాసిఁగాంచి యుండెను. వసుభూపతియు నింద్రుని కోరిక ప్రకారము స్వర్గ లోకమునకు రాకపోకలు సల్పుచు నధిక ప్రభావవంతుఁడై సర్వ సుఖముల ననుభవించుచుండెను.

# 8

ఇట్లు నిటఁ గోలాహలునితోఁ గల్గిన కలయికవలన శుక్తి మతి గర్భవతియై నవమాసములు నిండ నొక పుణ్యలగ్నమునఁ బ్రబ్బలి పొద లనెడు ప్రసవగేహమున నొక పుత్రికామణిని గనెను. ఆ పురిటిల్లు ఎఱ్ఱకలువలనెడు దీపముల కాంతులతో నిండి, కమలపత్రములను తోరణములచే రమ్యమై, పూఁదేనెలను తైల ములతోఁ గూడి, పుప్పొడులనెడు విభూతితో నొప్పియుండెను. బాలికామణి జన్మించిన శుభసమయమునందు దిక్కులన్నియుఁ బ్రసన్నములై యుండెను. చంద్రుఁడు నిర్మలకాంతులతోఁ బ్రకా శించుచుండెను. ఆకసము మేఘములచేఁ గప్పఁబడక నిర్మల ముగా నుండెను. గ్రహములన్నియు శుభస్థానములందుండి గొప్ప ఫలములను జేకూర్చునవిగ నుండెను.

ఈ సంతానప్రాప్తివలన శుక్తిమతి కోలాహలునివలన గల్గిన యవమానమును, గోలాహలుఁడు వసురాజువలనఁ గల్గిన పరాభవమును మఱచి సంతోషముతో నిరువురును గాలము గడు పుచుండిరి. ఆ నదీతీరమున నున్న యాశ్రమములలోని మును లెల్ల రీ బిడ్డను దీవించి 'నగజాత' యని పేరిడిరి. అంత నా నదీలలామ తన బిడ్డకుఁ బూఁదేనెల నుగ్గులిడుచుఁ, గలువరేకుల పొత్తికలు పఱచిన తరంగడోలికలోఁ బరుండఁబెట్టి జోల పాటలు పాడుచు, నదీజాతయని ముద్దుగ బిలుచుచు నతి గారాబముతోఁ బెంచుచుండెను. ఆ బిడ్డ శుక్లపక్ష చంద్రుని

మాడ్కి దినదినాభివృద్ధిగాంచుచుండెను. ఆ బిడ్డకు శుక్తిమతి యందు విహరించుచున్న రాయంచలు నడకలను నేర్పెను. నడ యాడనేర్చినంతనే యా నదీతీరమువనుండు కానన భూములయందు నడుగులిడుచుండెను. అపు డా బాలిక కందలి చిలుకలు మధుర ములగు మాటలను నేర్పెను. మాటలు నేర్చి బాగుగా సంభాషింప గల్గినంతనే యచటి కమలవనమున మధుపానముచేసి యానంద ములో మునిగియున్న గండుతుమ్మెదలు పాటలను నేర్పెను. పాటలుపాడ శక్తికలదియైన పిదప నదీతీరమందలి వృక్షములపైఁ దిరుగాడు నెమళ్ళు నాట్యములు నేర్పెను. సమీపాశ్రమమందలి తాపస స్త్రీలు స్నానముచేయుటకై నదీతీరమునకు వచ్చి నదీజాత యొక్క యాటలకుఁ, బాటలకు సంతసించి దీవనలిచ్చుచుండిరి. వనదేవతలు కొందఱామెను దాదులై పెంచుచుండిరి. మఱికొందఱు సైరంధ్రులై యలంకారములు చేయుచుండిరి. వేరొక కొందఱు చెలికత్తియలై యామెతో విహరించుచుండిరి.

అంత నా సుందరాంగి స్నేహితురాండ్రతోఁ గలిసి యిసుక ప్రదేశములకు వెడలి కొంతవడి సాఁగిలిమూఁత లాడుచు, మఱి కొంతకాలము కందుకక్రీడలతోఁ గాలముపుచ్చుచు సర్వదా క్రీడా పరాయణయై తల్లికి ముదము చేకూర్చుచుండెను. ఇంకను గొంత పెద్దదియైన పిదపఁ జెలికత్తియలతోఁ గలిసి పర్వతభూముల కేగి యచట చెట్లక్రింద బొమ్మరిండ్లు కట్టి, యందు బొమ్మల పెండ్లిండ్లు చేయుచుఁ లేఁజిగుళ్ళనెడు పళ్ళెరములందుఁ గేసరము లను భక్ష్య ములను, పుష్పములనెడు నోగిరమును, మధురసమనెడు ఘృత మును నుంచి యెల్లరకు విందులు సేయుచుండెడిది. ఆ బిడ్డ తన సమీపమున నాడు నాటలను దండ్రి గాంచి యధికానంద

మనుభవించుచు నామెను దగ్గరకుఁ దీసి 'నగజాత' యని పేరిడి ముద్దులాడుచు మెడయందు ధరించిన శంఖమాలం గాంచి 'అబ్బా! యీ పసికూన కంఠమున శక్తిమతి కాంతిహీనములైన శంఖముల నేల కట్టెనా'యని తలఁచి వానిం దీసివైచి, రత్నాలహారములను వైచి పంపుచుండెడివాఁడు. తల్లికడకు వెళ్లినప్పటి కామె బిడ్డ కంఠమునందు వ్రేలాడు రత్నహారములం గాంచి 'యీ లేఁబ్రాయపుబిడ్డ కీ కర్కశాలంకారము లేల? ఈ హారములవలన బిడ్డ శరీర మెక్కడ కందిపోవునో'యని వెతఁజెందుచు నా హారములఁ దొలఁగించి మృదువులైన కలువపూలదండలతో నలంకరించుచుండెడిది. ఈ విధముగా నా యమ తలిదండ్రులచే నతిగారాబముగఁ బెంచఁబడుచునుండఁ బదివత్సరముల వయస్సుగలది యాయెను. అంత శక్తిమతి తన యనుంగుబిడ్డకు విద్యాబుద్ధులు నేర్పింప మదిఁ దలంచి, సుకవిస్తోమమును బిలిపించి వారిచే నెల్లవిద్యల నేర్పించెను. పిమ్మటఁ దండ్రి తనశిఖరములయందు సవాసము మేర్పరచుకొనియుండు కిన్నరులకడ కా ముద్దులబిడ్డ నంపి వారివలన గానకళా వైదగ్ధ్యమును సంపూర్ణముగా నలపడునట్లు చేసెను. అటు పిమ్మట కొంతకాలమున కా కన్యక వీణా వాయిద్యమునందు నిరుపమాన ప్రభావము కలది యయ్యెను. విద్యాభ్యాసము ముగియునప్పటికి నగజాతకు 'యుక్తవయస్సు వచ్చెను. అపుడు కోలాహలుఁడు తన లేఁబట్టికి రత్నాలమేడ యొకటి నిర్మించి యొసంగెను. తల్లి రత్నాలమేడయందు బిడ్డ యొంటరిగా నుండఁ జాలదని యెంచి తన ప్రియసఖియగు రంభ సహాయమున దేవతావనితలను రప్పించి, చెలికత్తియలుగా నేర్పఱచెను. అంత నా నగజాత తల్లియంపిన చెలికత్తియలతోఁ గలిసి తండ్రి యొసంగిన

మణిమందిరమున నివసించుచుఁ దలిదండ్రుల కడకు వచ్చుచుఁ బోవుచు దన గానవిద్యా నైపుణ్యముచేఁ జెలుల రంజింపఁజేయుచు గాలము పుచ్చుచుండెను. ఆ నగజాతయే యీ తరుణీమణి. ఈ పర్వత శిఖరములపై మెఱయుచున్న యీ మణిధామములును, నీ కొలంకులును, నీ లతానికుంజములును, మల్లెపొదలతో దట్టముగా నిండియున్న యీ కోనలును నీమెకు విహారభూములు" అని యీరీతి నుపరిచర వసుమహారాజుకథయు, నగజాత జనన వృత్తాంతమును మంజువాణి యా మునికి విన్నవింప నా మాయామౌని వింతయైన యా యువతి వృత్తాంతమును విని యానందాబ్ధి నోలలాడుచుండెను.

# 9

మఱుఁగున డాఁగియున్న వసుమహారాజు నర్మసచివుని నైపుణ్యముం గాంచుచు, సమయానుకూలముగ ముచ్చటించు మాటలకుముదమందుచు నా కన్యకామణి వృత్తాంతమును వీనులలర వినుచుండెను. ఆమెవృత్తాంతమును వినినకొలఁది రాజు పరవశుఁ డగుచునుండెను. అనుక్షణ మా యువతి చక్కఁదనమున కుప్పొంగి పోవుచుండెను. నడుమనడుమ కన్యకయో, వివాహితయో యని సందియముచేఁ గలఁతఁజెందుచుండును. మంజువాణి మాటలను బట్టి కన్యకయే యగునని మఱల సంతసించుచుండును. కొంతతడ వా సుందరాంగి నెట్లు చేపటుటయా యని విచారించుచుండును. ఒక్కొకపరి మంజువాణి నర్మగర్భపు వాక్యములవలన నా సుందరి తననే తప్పక చేపట్టునని యువ్విళ్లూరుచుండును. మఱియొకమా ఱీ కన్యకారత్నము శుక్తిమతికి జనించినదగుటచే నాత్మధనముగ భావించి సంతోషపరవశుఁడగుచుండును. ఈరీతి నాతఁడు పరిపరి విధముల నాలోచించుచు నా ప్రదేశముననేయుండి చూచుచుండెను.

కపటయతి నగజాత వృత్తాంతము నామూలాగ్రముగా విని కొంతతడవు కన్నులు మూసికొని యేదియో ధ్యానించుచున్నట్లు నటించి 'మంజువాణీ! మే మాంతరదృష్టితో బాగుగఁ బరిశీలించి యుంటిమి. మీ సఖియైన నగజాతను రూపరేఖా ప్రభావాదుల నీడు జోడైన వసురాజచంద్రుఁడే పెండ్లియాడునట్లు కనుగొంటిమి. ఆ విధాత యిట్టి కాంతారత్నమును సృష్టించి వసువుతోఁ గూర్ప

కున్నా నాతని నిసర్గమధురమగు సృష్టివై చిత్ర్యము ప్రజామోద మును బడయఁజాలదుగదా! పౌలఁతులలో నీ గిరిరాజకన్యక యెట్లు సంస్తవనీయురాలో యట్లే వసుంధరాపతులలో వసురాజు మేటి. అట్టి మీ రిరువురి సమాగమము పుష్పమును, దావియుఁ గలిసినరీతి లోకానందదాయకమై యుండఁగల'దని స్పష్టపఱచెను. ఆ మాటలకు మంజువాణి సందియమంది 'మునివర్యా! మీ రాగతానాగతవిదులై పల్కినపల్కులు నిక్కువంబులు కానోపు; కాని యీసంఘటన మెట్లు సమకూడఁగలదాయని సందియము కల్గు చున్నది. వసురాజీ పర్వతముఁ గాంచుట కేనాఁడు వచ్చును? ఈ తీవఁబొంపములతోఁ గూడిన కోనలో నే నాఁ డడుగిడును? ఈ కన్నియ నెప్పుడు కనులారఁ గాంచి గారవించును? మా యభీ ష్టము లేనాఁడు తీర్చును? ఇక్కార్య మెంతగ విచారించినను దుర్ఘ టముగానే కాన్పించుచున్నది. మీ రిరువురికి దాంపత్యము కుదురుట తమ యమోఘవచన ప్రభావముచేఁగాక వేరువిధముగ నెట్లు లభింపఁగలదు? అఘటన ఘటనాప్రభావులగు తమసామర్థ్య మెన్న నేరికిఁ దరమగు'ననుచు వచించి మిన్నకుండెను.

ఆమె పల్కు లాలించినంతనే యా మాయకాఁడు చిఱు నవ్వు నవ్వి, కొంతవడి కనులుమూసి జపమాలికం ద్రిప్పుచు, నేదియో జపించువానివగిది నటించి 'లలనా! యీ యెలనాగను వసుభూపతి తప్పక పెండ్లియాడును. ఇందెంత మాత్రము సంది యముఁ జెందఁ బనిలేదు. ఆ వసురాజీ కాంతారమున కెప్పుడు వచ్చునోయని కదా నీ సందియము. నా మంత్రప్రౌఢిమచే నా రాజచూడామణి నిప్పుడ వచ్చునట్లుచేతును; చూడుము. అట్లాతనిని రప్పింపలేకున్నఁ బరమాత్మపాదములకుఁ దప్పినవాఁడ నగుదు'

ననుచుఁ బ్రతిజ్ఞఁజేసి, మఱికొంతవడి కనులుమూసి జపించి, కన్నులు తెఱచి నలువైపులం దిలకించి, 'మఞ్జూ'యని దిక్కులు ప్రతిధ్వనించునట్లు కేకవైచి తనచేతనున్న యోగదండమును నేల పైఁ దట్టెను. చెట్లచాటున దాఁగియున్న వసురాజిదియ యదనని తలంచి మేఘపటలినుండి వెల్వడిన చంద్రునీపగిది చెట్లచాటున నుండి వచ్చి యా మునియెదుట నిలచెను. యువతులెల్లరు మద నుని ధిక్కరింపఁజాలిన రూపరేఖా విలాసములతోఁ జెన్నలరారు చున్న వసుభూజానిం గాంచి, దిగ్గనఁ దమ యాసనములనుండి దిగి సంభ్రమాక్రాంతలై నిలచియుండిరి. అంత క్షితిపాలుఁడు సంతసముతో సమీపించి మునికి నమస్కరింప నా మాయావి 'నీ యభీష్టము నెఱవేఱుగాక' యంచు నాశీర్వదించెను. మంజు వాణి సాదరముతో రత్నపీఠికనిడి యందుఁ గూర్చుండఁ బ్రార్థింప, వసుభూపతియు ముని యనుమతిపై నం దాసీనుఁడయ్యెను. సూర్యోదయముం గాంచిన పద్మినివోలె సాటిలేని మేటి రూప ముతో విరాజిల్లు భూనాథుం గాంచిన నగజాత యానందముతోఁగళ కళలాడుచుండెను. అట్లే వసుభూపతియు నా నిరుపమాన సుంద రాంగిం గాంచి యామెను గలియుటకుఁ గాలయాపనమును సహింపఁజాలక మదనానలసంతప్తుఁడై యుండెను. ఇట్లా నాయికా నాయకులు పరస్పరానురాగవిముగ్ధులైయుండఁ గాంచి మంజు వాణి సరసవచనములతో వాఙ్మాధుర్య ముట్టిపడ రాజుతోఁ బ్రసం గింప నారంభించెను.

మంజు:—రాజచూడామణీ! మీ రాకవలన నేఁడు మా యభి మతార్థము లన్నియు సిద్ధించినట్లు భావించుచున్నదాన.

వసు:—మీ దర్శనభాగ్యమువలన మా కోర్కెలును నెఱవేఱినట్లే తలంచుచున్నాఁడ.

మంజు:—ఇదియంతయు వసునాధమంత్రోపాసకులైన యీ మునినాధుని యనుగ్రహమువలననే సంభవించినదికదా!

వసు:—ఔను! వారి దయలేనిది మేము రాజులమయ్యు నడుగిడుటకైన సమర్ధులము కాఁజాలము.

మంజు:—మా సఖీమణి మీ సందర్శనమువలన నేఁడుకదా ధన్యురాలైనది.

వసు:—మీ నాయికా సందర్శనమువలన నీ వసువుకూడ ధన్యుడైనాఁడనియే తలంచెద. ఇఁక మీ వృత్తాంతముం జెప్పి నన్నలరింపఁజేయుము.

మంజు:—దీనావనా! మే మీ వనమునఁ గాపురముండియు మీ సంరక్షణమును బొందినవారమే కాని, యన్యులము కాము. మా ప్రియసఖియగు నగజాత మీ విహారాద్రియగు కోలాహలునకును, మీ పాదసేవానిరతురాలై ప్రవహించు శుక్తిమతికిని జనించిన ముద్దులబిడ్డ. మే మామె చెలికత్తియలము. ఎల్లపుడు మీ విజయగేయములతోను, మీ చాటుకథారచనలతోను మే మీమెను జిన్ననాఁటినుండియు నలరించుచుందుము. ఈమె సర్వకాల సర్వావస్థలయందును మిమ్ములనే మనమునఁ దలంచుచు మీపైననే వలపు నిలిపియున్నది. అట్టి మా ప్రియసఖి కోరిక యీ మునిపుంగవుని యనుగ్రహముచేతనే యీ నాఁటి కీడేరినదని భావించుచున్నదాన.

వసు—:యువతీ! గొప్ప మంత్రసిద్ధుఁడగు నీ ముని మహిమను గొనియాడ వశమగునా? మీ యనుంగువయస్యను గాంచు

నట్టి సుకృత మవలీలఁ గల్పించిన యీ యనఘుఁడు మాకుఁ బరమాప్తుఁడనియే చెప్పవలెను గాని, సామాన్య మునియని నుడువ వలనుపడదు. ఈ మహనీయుని మంత్రప్రభావము వలననే మీ మృదుమధురాలాపమును విను భాగ్య మబ్బినది.

ముని:—న న్నింతఁగఁ గొనియాడఁ బనిలేదు. దీని కంతటికిని జరాచర సృష్టికర్తయగు నా పరాత్పరుఁడే కారణభూతుఁడు. దేనిలోనైనను మానవుని శక్తిసామర్థ్యము లెంతటివి? మంజువాణీ! యిఁక కన్యారత్నమైన మీ ప్రియసఖికిని, బురుష పుంగవుఁడైన యీ వసుభూపాలునకును నమూల్యకల్యాణసంసిద్ధి తోడనే చేకూరుఁగాత మనుచు దీవించి నే వచ్చి చాలతడవైనది. పరతత్వమును భజించుట కేగవలెను. మీ కోరిక ప్రకారము వసురాజును రప్పించి యొసంగితిని. ఇఁక వెళ్ళి వత్తును.

మంజు:—మీ మంత్రప్రభావమువలెనే మీ యాశీర్వచన ప్రభావముకూడ ననతికాలముననే యీడేరునుగాక!

వసు:—మహాత్మా! మీ పునర్దర్శనమున కెదురుచూచుచుండువారము.

ముని:—అందుఁ దప్పేమి? అటులనే జరుగఁగలదు.

అనిచెప్పి యటనుండి సమీపమున నున్న మందారతరు వాటికలోనికి వెడలి మునివేషమును వదలి యథారూపమును ధరించి కొంతకాల మచటనే మసలి, రాజును వెదకు నెపముతో మరల నచ్చటికి విచ్చేసి, భూపతిని గాంచి యాశ్చర్యముఁ జెందినట్లు నటించుచు 'మహారాజా! నే నట సరోవరమున దీనీరములం గ్రోలి వచ్చునప్పటికే మీరు మాయమైతిరి. అప్పటినుం

యింతవఱకు మీకై చెట్లనక గుట్టలనక వెదకి వేసారి తుద కిక్కడ దైవవశమునఁ మిమ్ముఁ గాంచితి' నని పల్కుచుఁ జతికిలఁబడెను. అప్పు డా యువతులెల్ల రాతని పలుకుబడిని, ముఖకవళికలను గాంచి తొల్లిటి మునిగనే భావించి సిగ్గుచెందినవారలై యాతని నైపుణ్యమును మనమునం దలపోయుచు 'ఔరా! యీ వసురాజు వేడుక చెలికానితోఁగూడ నీ పర్వతముమీఁదకు విహారార్థముగ వచ్చి, మనసఖిని జూచివచ్చుట కీతనిని గపటమునివేషముతోఁ బంపి యుండవచ్చు' నని తమలోఁదాము చెప్పికొనుచు నాతని నేర్పున కచ్చెరువొందుచుండిరి.

ఇట్లు ముచ్చటించుకొనుచుండ నొక సఖి 'యింతులారా! యీ నృపశిఖామణి వచ్చుటచే మన గిరికానన మెంత సొబగు వహించెనో చూడు' డనుచుఁ బరియాచకముగఁబల్కఁ, నగజాత కుమారి సిగ్గుచేఁ దలవంచుకొని తన యురమునను న్న ముత్యాల హారములోని నాయకమణియందుఁ బ్రతిఫలించు వసురాజు రూపముం గాంచి లోలోన మురియుచు నా నవమన్మథుని యాకారమును గాంచుటయందే సముత్సుకురాలై యుండెను. ఆ సఖి యీకీ లెఱింగి 'యువతులారా! యీ నాయిక మెడలోని ముత్యాల హారమందలి నాయకమణి లావణ్యముం గంటిరా?' యన నెల్లరు నవ్వ నారంభించిరి. వా రిట్లు పరిహాసముచేయుటకు నగజాత తన చెలికత్తియలపై నలీకపుఁ గినుకవహించి వారిని మాటలతో మందలించుచుఁ, జూపులతో బెదరించుచుఁ నటనుండి లేచి యావల కట్టఁబడిన యవనికచాటున కేగెను.

అప్పుడు వసురాజు తనకన్నుల కఱపుతీఱఁ గాంచుచున్న నగజాతముఖసౌందర్యము మఱఁగుపడుటకు వగచి 'వనితలారా!

యీ బాలికామణి యెందుల కిట్లలుకఁ బూని వెడలినది?' యని యడుగ మంజువాణి యాలించి 'మహారాజా! అది యలుకకాదు. నాయకమణి సెచ ధరించిన కులుకుతో నామె యటు వెడలు చున్నది. కులుకుశీరి యలుకుకలిగిన వెంటనే యిటకు రాఁగల' దని వేడుకగాఁ బల్కెను. మహారాజా పల్కులకలరి 'వనితా! మీ నాయిక యెదఁ జేరు భాగ్య మబ్బినందులకు నాయకమణియుఁ గులుకవలసినదేసుమా!' యనుచుఁ బల్కుచుండఁగనే మంజువాణి తెరచాటున కేగి యామె కేదియో పిటికిమందు పోసి యలుకుఁ గలిగించి వెంటం దోడ్కొని వచ్చి యుచితాసనమునఁ గూర్చుం డఁబెట్టెను. అంత రా జూరటఁ జెందినవాఁడై యామె ముఖ చంద్రుని సోయగమును గనులారఁ గాంచి సంతోషముతో ఱెప్పలు వాల్చక చూచుచుండెను.

ఇట్లుండ తల్లియగు శుక్తిమతికడనుండి కలహంసియను సఖి వచ్చి 'రాకుమారీ? మీ తల్లిని సేవింపవచ్చిన మునిబృంద మమూల్యములై పరువముఁదప్పని పారిజాత ప్రసూనదామముల నర్పించి వెడలగా నదీమతల్లి వానిని గ్రహించి నీకొసంగు కుతుకముతో నీ రాక కెదురుచూచుచున్నది. వెంటనే వచ్చి వానిం గైకొనుము. రమ్ము పోద'మనుచుఁ బిల్వ, నదీజాత యులికిపడి మఱలఁ గొంతవడికిఁ దెప్పరిల్లి తల్లియాజ్ఞ ముందుకును. వసు రాజ ముఖసౌందర్యావలోకన కుతుకము వెనుకకును లాగుచుండ నేమిచేయను దోపక మంజువాణిం దిలకించెను. ఆమె నాయిక మనమునఁ గల్గిన కలతం గ్రహించి 'సఖీ! మునిప్రసాదము శిరసాధార్యము. సందియమందనేల?' యనుచుఁ బల్క నగజాత యాసనమునుండి లేచి రత్నాలయందెలు ఘల్లుఘల్లున మ్రోగఁ

బయనమై వెడలనారంభించెను. అపుడు చెలికత్తియ లెల్లరు మక్కువతోఁ జెయిపట్టి 'సఖీ! వసురాజప్రాప్తియు మునిప్రసాదముకాదా? భూలోకపురందరుని యనుమతి వడయక వెడలుట యెట్లు తగవగును? ఇట్లు మమ్మల నవ్వులపాల్సేసి తరలుట యుచితమా'యనుచు నడ్డగింప నామె యెటు చెప్పుటకును దోచక నిలచియుండెను.

అపుడు మంజువాణి ముసిముసినవ్వులు నవ్వుచు రారాజుం గాంచి 'భూనాథా! మా చెలి తల్లియాజ్ఞ నెఱవేర్ప వెడలనుంకించి మీ యనుమతికై వేచియున్నది. తాము దయయుంచి యామె మీఁది ప్రేమను విడనాడక వీడ్కోల్పుఁడు. వెడలివచ్చును. ఈ జనము తమ పునర్దర్శనమునకై కాంక్షించుచున్న'దని విజ్ఞాపనముఁ గావించెను. అపుడు వసురా 'జట్లే యగునుగాత'మని పల్క మంజువాణి నగజాతను దోడ్కొని బయలుదేఱెను. మిగిలిన చెలికత్తియలును నామె ననుసరించి వెడలనారంభించిరి. వారట్లు వెడలుచుండఁగా సుదూర మా భూపతిచూపులు నగజాతను వెనుదవులుచునే యుండెను. నాయికయు రాజదర్శనము విడనాడు కుముదమువోలె మహారాజును విడనాడి వెడలుటకుఁ దహతహపడుచు ముందునకు సాగిపోఁజాలక మెలమెల్లగ నడుగులిడుచు నేదియోనెపమున వెన్కకుఁ దిరిగిచూచుచు నెట్లో యతి కష్టము మీఁద వెడలెను.

# 10

"ఆహా! నేత్రానందదాయినియగు నొప్పులకుప్ప నగజాత యేగినదికదా! ఆ యువతీరత్న మిందుండుటవలననే కదా యీ మందిరము కన్నులకు మిఱుమిట్లు గొలుపు కాంతులతోఁ బ్రకాశించియున్నది. ఆ రత్నము వెడలిన పిదప నిఁక దీనికిఁ గాంతి యెక్కడిది? ఇంతవఱకు నానందనిలయమైన యీ మందిర మిపుడు దుఃఖమునకుఁ దావలమైనదికదా! నగజాత లేని యీ శూన్యాగారమున నే నెట్లు నివసింపఁగలను? అయ్యో! నేఁ దలఁచిన తలంపులును, జేసిన యత్నములును, బొందిన యాశలును నిరర్థకమైనవే! ఆ బంగరు బొమ్మ- ఆ రతనాలకుప్ప- ఆ ప్రేమల పెన్నిధానము- ఆ ముద్దుల మురిపము వెడలిన పిదప నీ మందిరము శూన్యముకాక మతేమగును? ఇపు డేమి చేయుదును?" అని వసుమహారాజు విచారసాగరమున మునిఁగినవాఁడై యీ మందిరమును విడనాడి రతనాలకోనలో నెలమావిచెట్ల సందుగ నా సుందరి వెడలిన మార్గముననే వయస్యునితోఁగూడఁ గొంత దూర మేగి యచ్చటను నా జవ్వనిం గానక వేడినిట్టూర్పులు విడచుచు నేమిచేయుటకును దోచక, యన్నిదిశలు కలయఁ బరికించి వ్యర్థప్రయత్నుఁడై మఱలి మణిమందిరముంజేరి యాసుందరి నివసించిన చలువఱాతి వేదికపైఁ గొంతకాలము విశ్రమించెను. అప్పటికిని గలఁత తీరనందునఁ దన ప్రియవయస్యునిం బిలచి 'చెలికాఁడా! నగజాతా విరహితమైన యీ మణిమందిరము

చంద్రుఁడులేని రాత్రి పగిదియుఁ, బద్మములులేని సరోవరము భాతియు, దినమణిలేని దివసంబు రీతియు నెట్లు కళావిహీనమై యున్నదో చూచితివా? ఈ క్రీడాసరస్సుల యందలి రాయంచల గములును, నా సరోవరతీరమందలి వృక్షములపైఁ గ్రీడించు మయూరతండములును, నీ మణిమందిరములో మధురరసము లొలుకునట్లు మాటలాడు శుకనివహంబులును, నీ మామిడి చెట్లపై లేఁజివుళ్ళను మెసవుచుఁ గూకూ యని కూఁతలుకూయు చుండు కోయిలల సముదాయములును నెంతటి తపము సల్పినవో కాని యామె నెల్లపుడు సేవించు భాగ్యము కల్గియున్నవి. ఇఁక నీ శూన్యావాసమందు మన మేరీతి నిలువఁగలమో?' యని పలు కుచు వేడి నిట్టూర్పులు విడచుచుండెను.

నర్మసచివుఁడు తన నాయకుని యవస్థంగాంచి యెట్లయిన నాతని సోదార్పఁ దలఁచినవాఁడై 'రాజా! యేల యీ లీల ధైర్యగాంభీర్యములను విడనాడి వెతఁజెందెదవు? సౌందర్యమున రతిని విస్మరింపఁ జేయఁజాలిన వనితామణు లెందఱు మీ యంతః పురమున లేరు? దేవలోకమునకు వెడలినప్పుడెల్ల నచ్చట నెంద అచ్చెరమచ్చెకంటులు కాన్పించుటలేదు? మీరు సరియన వరించు రాచకన్యక లెందఱులేరు? వారిని గాదని యీామెకై యీపగిది సంకటముఁ జెందఁదగునా?' యని పలుకుచుండ నా రాజునకు మఱింతవేదన యధికమై యుస్సురనుచు లేచి, నగజాత వీణియ మీటిన చోటును, దాను మాటున డాగియున్న వృక్షపంక్తులను, నామె సఖులతో సంభాషించిన ప్రదేశములను గాంచుచుఁ బరవ శత్వముఁ జెంది యేమిసేయుటకును దోచక యామెనే మనమున ధ్యానించుచు నొక చలువఱాతియరుఁగుపైఁ జతికిలఁబడెను.

అపుడు వేడుక చెలికాఁడు పార్థివునిపరితాపమును గాంచి తత్తరపాటుచెంది యీతని ననునయవాక్యములతో నోదార్చకున్న మఱింత మదనవేదనంజెంది తీరనిదుఃఖమునకు గుఱియగునను చుఁ దలఁచి 'గంభీరస్వభావ! యేల యిట్లు నిరంతరచింత నొంది తాల్మి విడనాడెదవు? ఆ కన్నియకును నీపై నినుమడించిన మక్కువయే యుండియున్నది. ఆమె చూపులతీరునుఁబట్టియు, సఖియల సంభాషణమునుబట్టియు నీ కపగతము కాలేదా? కాని యేమిచేయఁగలదు? అబలయుఁ బరాధీనయు నగుటవలనఁ దన మనోగతమును నెయ్యములచేతనేగాని మాటలతోఁ దెలుపఁజాలక మఱలిచూచుచు వెడలినది. నిన్ను బాధపెట్టు విషమాస్త్రుఁ డామెను గూడ సదా వేపుచునే యుండును. రాజా! దుఃఖమును విడనాడి ధైర్య మవలంబించుము. ఆమెతండ్రియగు కోలాహలుఁడు మీ పాదములకు వినతు లొనర్చువాఁడేకదా? తల్లియగు శుక్తిమతి మీ పరాక్రమముచేఁ గాపాడఁబడినదియే. చెలికత్తియలు మీ కథల నెల్లప్పుడు గేయరూపమున మక్కువతోఁ బాడుచుండు వారలు. బాలికామణి మీ నవమన్మథాకారమునకుఁ జొక్కి మీపై వలపు నిలిపియేయున్నది. ఇట్టియెడ మీయభీష్టము నెఱవేఱుటలో నిసుమంతయు సందియములేదు. ధైర్య మవలంబించుము. మన మిచటకి వచ్చి చాలతడవైనది. మనరాకకై పరిజన మెదురు చూచుచునుండును. కనుక మన మిచ్చోటువాసి పరిజనముం గలిసి మగిడి మనవీటి కేగుదము. పిదప నీ కార్యమును క్షణములో నా నైపుణ్యముం జూపి సఫలముగావింతును. సందియంబు నొందకు' మనుచు ననునయింప రా జెట్లో ధైర్యము వహించి బయల్వెడలి యా గిరివరముం డిగ్గి తన గంధగజము నధిరో

హించి, వెంట వారువమెక్కి చెలికాఁడు వచ్చుచుండఁ బరివార మున్న ప్రదేశమునకుం జని వారితోఁగూడ సంపత్పేటికయనఁదగు నిజవీటికిఁ జని రాచనగరు సొచ్చి గృహాంగణంబున సింధు రముం డిగ్గి పరివారమును వీడ్కొలిపి యంతిపురిం బ్రవేశిం చెను. వేడుకచెలికాఁడును రాజానుమతింబడసి తనగృహమున కేగెను.

లోనఁ బ్రవేశించినంతనే రాణివాస మెదురేగి సాదర ముగ లోనికిం గొంపోయిరి. అటనుండి పరిచారికలు రాజును స్నానశాలకుం గొంపోయి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టిరి. కొందఱు యువతులు హారతులం ద్రిప్పిరి. మఱికొందఱు జల కుండికయందు వేడినీరు సిద్ధముచేసిరి. వేఱొక కొందఱు సుగంధ తైలముం బూసి నలుగిడి జలకమార్చిరి. ఈరీతి స్నానకలాపము ముగిసినంతనే రాజు రాణివాసపుఁ బ్రార్థనలపై భోజనశాల కేగి యావఱకె సిద్ధపఱచియుంచిన బంగరుపీటపై నుపవేష్టించెను. బసిండిపళ్ళెరముల వివిధాన్నముల నుంచిరి. వసురాజా నగజాతనే మనంబునఁ దలంచినవాఁ డగుటచే విచారమున మునిఁగియుఁ బైకిఁ గనుపడనీయకుండుటకై పదార్థములు రుచింపకున్నను నేదియో యొకరీతి మెసవి యటనుండి మెలమెల్లగ శయనాగార ముంజేరి యమర్పఁబడియున్న పూలసెజ్జలపైఁ బవ్వళించెను. కాని నగజాతవియోగమువలనఁ గల్గిన మనోవేదనచే నిదుర పట్టక యటు నిటు పొర్లుచు నామెరూపమునే మనమునఁ దలపోయుచు నెట్టెట్లో యారాతిరిఁ గడపెను. ఇట్లే యామెయందలి మక్కువ దినదినమున కధికము కాఁగా నిద్రాహారములను సైతము మాని శుష్కించుచు నతిప్రయాసతోఁ గాలముగడపుచుండెను.

# 11

నగజాత వసుభూపతిని విడనాడి తన చెలికత్తియలతోఁ గూడఁ దల్లియింటికి వెడలి జననికి వందన మాచరించి నిలచి యుండెను. అంత శుక్తిమతి తన బిడ్డ నక్కునం జేర్చి శిరము మూర్కొని తాపసు లొసంగిన పారిజాత ప్రసూనదామములను దలయందు ముడిచి సంతసమందుచుండెను. నగజాత మనము శూన్యమైయుండుట కతన నచ్చట నెక్కువకాల ముండఁజాలక తల్లి యనుమతిం బడసి వసురాజును గాంచు కుతూహలముతోఁ దిరిగి తన మణిమందిరమున కేగి మామిడిచెట్ల మఱుఁగునను, నుపవన ప్రదేశములలోను వెదకి వెదకి తన మనోనాథునిం గానక విచారించుచుండెను. పాప మామె యాశలన్నియు నిరాశలైనవి. మనోవేదన యధికమైనది.

అంత నా నగజాత మదనతాపమును భరింపఁజాలక వేడి నిట్టూర్పులు విడచుచు పూసెజ్జంజేరి విచారము కలదియై మిగుల వగఁజెందుచుఁ జెలికత్తియ లెంతగఁ బ్రార్థించినను జలకంబు లాడకయు, మధురపదార్థంబుల మెసవకయు, మైపూఁతలందు మనసుఁగొనకయు, సఖులతోఁ బలుకకయు , నాభరణములఁ దాల్పకయు నొంటరిగఁ బరుండి వసుభూపుని మోహనరూపమునే తలంచుచుఁ బూటపూటకు ఖిన్నయై సన్నగిల్లుచుండెను. పగలంతయు నెట్లో కాలము గడచుచున్నను రాత్రి సమయములయందు నిముస మొక యుగమగుచుండ శయ్యపైఁ గూర్చుండి "ఔరా!

నేను వీణ వాయింపనేల? వాయించితినిపో, మాయజటిలుఁడిచ్చటి కేల రావలయును? వచ్చెనుపో, వసునాధుని ముచ్చట యేల తేప లెను? తెచ్చెనుపో, నాతఁడు కృత్రిమ జపవ్యాజముతో నా పృధ్వీశు నేల రప్పించవలెను? రప్పించెనుపో, నా కాతనియందు వలపేల కలుగవలెను? కలిగినదిపో, వెంటనే వానిపొందు లభింపకుండు టేల?' యని తలపోయుచు శయ్యపై వ్రాలి తాప మధికముకాఁగా మఱల లేచి 'అబ్బా! యిఁక నెప్పటి కీ కోర్కె యీడేరఁగలదు? నా తల్లి కెప్పుడు జాలికలుగును? నా తండ్రి హృదయ మెప్పుడు కరఁగును? ఈ వియోగసముద్ర మెన్నటికిఁ దరింతును? ఆహా! యీ తాప మిఁక భరింపఁజాల' ననుచు దలపోసి చెలికత్తియలు నిద్రించుచుండ నడిరేయి శృంగారవనిలోఁ బ్రవేశించి చంద్ర కాంత వేదికపైఁ గూర్చుండి పండువెన్నెలలకుఁ దాళఁజాలక చంద్రుని బరిపరివిధంబుల దూషించుచు నా వనమం దంతటను దిరుగుచుండెను.

మణిగృహమున నేమరి నిదురించిన చెలికత్తియ యులికి పడి లేచి చూడ నందు నగజాత కాన్పింపకపోయెను. అందుల కెల్లరు తత్తరపడి 'గిరిసుతా! యెచటి కేగితివమ్మా!' యని వదరుచు నా సమీప ప్రదేశములయం దంతటను వెదకి వేసారి కేళీవనంబునకు వచ్చి చూడ నచట నొకచో మేనువాంచి మదన తాప మనుభవించుచుఁ బడియుండఁ గాంచి 'అమ్మా! ఒక త్రుటికాలమైన మమ్ములఁ బాయనొల్లని నీ వీ నాఁడేల నొంటరిగ నీ రాత్రివేళ నిచ్చటకు వచ్చియుంటివి? అయ్యో! అడ్డముగాఁ బ్రవహించు నీ తేనెవాక నెట్లీదితివి? ఇట్టి సాహస కార్యములఁ జేయదఁగునా?' యని పల్కుచు భయపడినదేమో

యని దిగఁదుడుపులు పెట్టి యామె నొక లతాగృహమునఁ జేర్చి యా వసురాజుకథలనే చెప్పుచు నెట్లో యా రాత్రిఁ గడపిరి.

సూర్యోదయమైన పిదప 'సఖీ! యీ మదనతాపము తీరుటకు మదనవ్రతము సల్పుద'మనుచుఁ జెప్పి యామెతోఁగూడ సరోవరమును సమీపించి, యందుఁ జొచ్చి, స్నానమాచరించి, తీరమునకు విచ్చేసి, నగజాత యలకలు తడియార్చి, దువ్వలువలు గట్టనిచ్చి, తలయందుఁ బువ్వులు తుఱిమి, ముత్యాలహారముల ధరింపఁజేసి, గంధపుఁబూఁతలు పూసి, తిలక మిడి, తామును సలంకృతలై మదనవ్రతమాచరింప నొక రమ్యమైన ప్రదేశముం జేరి యొక మావిసున్నక్రింద బన్నీఁటితో, మెదపిన పుష్పొడితో నొక తిన్నె నిర్మించి దానిపై వట్టివేళ్ళ పందిరి కట్టి, యందుఁ బువ్వుల చప్పరము నొకదాని నేర్పఱచి, యా చప్పరము నడుమ తామరదుద్దు నాసనముగా నిడి, యందుఁ గస్తురి ద్రవముతో వ్రాసిన మన్మథుని చిత్రము నుంచి, యతని వామాంకమున రతీదేవిని నిల్పి, యెదుటఁ జంద్రవసంతులను నెలకొల్పి, యెడమప్రక్కఁ గోయిలలను, రాయంచలను, కుడిప్రక్కనఁ జిలుకలను, దుమ్మెదలను వ్రాసి యా యనంగుని నెల్లరు యుథాశాస్త్రముగఁ బూజించి, మధురరసముల నివేదించి, హారతులిచ్చి నమస్కరించిరి. అపు డా రమాకుమారుఁడు తమయెదుట సాక్షాత్కరించిన పగిది కనుపింప నగజాత ధైర్యముచెడి, వడఁకి, మైమఱచి మూర్ఛఁజెందెను.

అపుడు చెలికత్తియలు భయమంది సంభ్రమముతోఁ జుట్టును మూఁగి యేమిచేయుటకును దోచక, యెవరి నడుగుటకును దెలియక తుద కామెను బాలసెజ్జం జేర్చి పలువిధములగు చలువ

సేఁతలు సేయుచుండిరి. కొంతవడి కా నగజాత తెలివొంది యతికుంజరుఁడు వచ్చి వంచనఁ జేయుటయు, నరనాథుఁడు కూర్చున్న బంగరు పీఠమును, మనోహరుని మన్మథరూపమును, బదేపదే తలఁచి పరితపించుచు మదనతాప మాపుకొనఁజాలక యటనుండి లేచి చిగురుటాకు పాన్పుం జేరి యడలుచుండెను.

ఇంతలో సూర్యాస్తమయమయ్యెను. రాత్రికాలము వచ్చు నప్పటి కామె తాపమునకుఁ దాళఁజాలక వేడినిట్టూర్పులు విడ చుచు నా బాధను సహింపలేకయుండెను. మంజువాణి యా యమ పరితాపముం జూచి భీతిల్లి తోడి సఖులం బిలచి 'వనిత లారా! మన నగజాత పలు వెతలం గుందుచున్నది. ఇఁక మనము జాగు చేసితిమేని యీమె ప్రాణములు ధరించుట కల్ల. మీ రీమెను మణిమందిరముం జేర్చి చలువసేఁతలు చేయుచుఁ గాపాడుచుండుఁడు. నే నిపుడె బయల్వెడలి వసురాజు సన్నిధి కేగి, యీమె వియోగ బాధను దెల్పి యనతి కాలములోనే శుభ వార్తను దెత్తును' అని పచించి నగజాత మెడయందలి ముత్యాల హారమును గ్రహించి వెడలిపోయెను.

ఇటఁ జెలికత్తియలు నగజాతను గేళీవనమునుండి మణి మందిరములోని చంద్రకాంత వేదికపైకిఁ జేర్చి యామె కనేక విధములగు నుపచారములు సేయుచు మంజువాణి రాక కెదురు చూచుచుండిరి. కొంతకాలము గడచిన పిదప చంద్రకిరణములు గవాక్షమార్గమునుండి లోనఁ బ్రవేశించి నగజాతా శరీరమును సోఁకఁగా నా తాకుడున కామె తాళలేక 'అయ్యో! యీ చంద్ర హతకుఁ డిచ్చటను నన్ను వేధింపఁ బూనుకొన్నాఁడే! యేమిచేయ గలను? అబ్బా! యీ చంద్రతాపమును సహింపఁజాలను. ఓరీ

చంద్రా! నీ కిరణజాలమును ధరించుట మాబోఁటి విరహిణులను బాధించుటకేనా? రాజీవాక్షుల నేఁచు పాతకివగు నీకు రాజనామ మెట్లు చెల్లును? ఇంతులను గష్టపెట్టిన పాతక మంతటంతటఁ బోదు సుమీ! అయ్యది భయంకరాంధకారమై, ప్రళయకాల మేఘపటలియై నిను నాశనముచేయును. ఇప్పటి నీ సంపదకు నిక్కఁబోకు. రాఁబోవు కష్టములం దలఁచుకొనుము. ఓయీ! నీవు విషరాశియందు జనించితివి. కాలకూట విషమునకు సైదోడ వైతివి. విషము మెసవిన శూలిశిరమున విడిసితివి. ఇట్టి నీ స్వభావము విషముకాక యమృత మెట్లగును?' అని పెక్కువిధముల వనజారిని నిందించుచుఁ దాపమున కాగఁజాలక యతి దుఃఖముతో మోమునఁ గొంగుఁ జేర్చుకొని యెలుఁగెత్తి యేడ్వ నారంభించెను. సఖు లామె దుఃఖముం గాంచి కనుగొలఁకులనుండి కారు బాష్పములం దుడుచుచు 'నొప్పులకుప్పా! యేటి కిట్లు కుందెదవు? ఆ వసుభూరమణుఁ డనతి కాలములోనే వచ్చి నిన్ను గారవింపఁగలఁడు. దుఃఖ ముడుగు' మనుచు నోదార్చి 'అయ్యో! మంజువాణి యేగి యెంతతడవయ్యె? ఏల ఇంతజాగు సేయుచున్నది? నగజాత యవస్థ యెఱుఁగనిది కాదుకదా?' యని తలఁచుచు నలుదిక్కులు చూచుచుండిరి.

వసురాజుకడకు వెడలిన మంజువాణియు నాతని దర్శించి నగజాత యవస్థను దెల్పి, యా మహనీయునిచే నీయఁబడిన ముద్రాంగుళీయకమును గ్రహించి పరుగుపరుగున వచ్చి 'సఖీ! లెమ్మి. నీ కోరిక యీడేరినది. వసుభూపతి నీయందే యెక్కువ మక్కువకలవాఁడై పరిపరివిధములఁ బరితపించుచున్నాఁడు. అనతి కాలముననే నీ మనోనాయకుఁడు తప్పక నిన్ను చేపట్టఁ

గలఁడు. ఇఁక మనోవేదనను విడనాడి యూరడిల్లుము' అని యోదార్చెను. అపుడు సఖులెల్లరుఁ గ్రమ్మకొని యట జరిగిన వృత్తాంత మేమని యాతురతతో మంజువాణి నడిగిరి. 'సఖులారా! ఆ వృత్తాంతమును సమగ్రముగా వచింతును. నగజాతను స్నానపానాదులచేఁ దృప్తిపఱచుఁడు!' అని చెప్ప సఖులెల్లరు నగజాతను వెంటఁబెట్టుకొని యభ్యంతరగృహముం జేరిరి.

# 12

నగజాతామతల్లి సంతోష మతిశయింప స్నానపానాదులను క్షణకాలములో నిర్వర్తించినది. ఈలోపల మంజువాణియు విశ్రాంతిఁదీసికొని దారి బడలికం దీర్చుకొనెను. పిదప నెల్లరును మణిమందిరములోని చలువరాతి తిన్నెపైఁ జేరిరి. అంత మంజు వాణి యచట జరిగిన వృత్తాంత మిట్లు చెప్పనారంభించెను.

'సఖులారా! వసురాజు మనసును బరికించి వచ్చుటకై యిటనుండి బయలుదేఱి యాకాశమార్గమున భూమి కనతిదూర ముగ నీ కొండను జుట్టి పట్టణములమీఁదుగను, బల్లెలమీఁదుగను నతివేగముగా వెడలుచుంటిని. ఆ వేగమున కాకసము బోరన నఱచినట్లును, సమస్త ప్రపంచ మొక్కుమ్మడి ప్రత్యక్షమగు చున్నట్లును గాననయ్యెను. ఆరీతి వెడలునపుడు పురములును, గ్రామములును భూమిపైనఁ గుప్పపోసినరీతిఁ గాన్పించుచుండు టచే నిది యదియని తెలియఁజాలకుంటిని. అధిష్ఠాన పట్టణ మేదియో తెలిసికొనుటకై గమనవేగము నాపి నిలిచి క్రిందకు బరికించితిని. దైవానుగ్రహముచే నే నిలచినచోటనే యొక పెద్ద పట్టణము కాన్పించెను. ఇదియే యధిష్ఠానపురమై యుండనోపు నని జాడలనుబట్టి నిశ్చయించి వెంటనే యా పట్టణమందలి యున్నతసౌధము మీఁద దిగి యందు నిలిచి నలువలంకులు పరి కించితిని. అయ్యది దివ్యసౌధములతోను, మణిగోపురముల తోను, నుద్యానవనములతోను గూడి సప్తప్రాకారపరివృతమై

కొన్నబ్టెను. ఆ పట్టణమందలి గేహములన్నియు రత్నఖచితము లైనవిగను, బంగరు ప్రాకారములు గలవిగను నుండుటచే వానిలో నెయ్యది రాజసౌధమో పోల్చుటకు సాధ్యము కాకయుండెను. ఆ రాత్రి సమయమున నా పట్టణము జనసంచారశూన్యమై సమాధి నిష్ఠాగరిష్ఠుఁడైన మునివలె నిశ్చలముగఁ గాన్పించుచుండెను.

అపు డేమియుఁ దోచక యా సౌధాంగణమునకు డిగ్గి చూడ నది నవరత్నఖచితమై, రక్షకభటులచే సంరక్షింపఁబడుచు నుండుట చూచి యదియ రాజసౌధమని నిశ్చయించుకొని దేవతా ప్రభావముచే నన్యులకుఁ గాన్పడకుండ నుండుటకును. నెచ్చోట నైనఁ బ్రవేశించుటకును ననువగు సూక్ష్మరూపమును ధరించి యటనుండి బయలుదేఱి కేళీగృహంబులను, దంతపు జవికలను, దేవతామందిరములను, భోజనశాలలను, నాట్యాగారములను దాటి వసుధాపతి శయ్యాగారముం దగ్గఱితిని. అందు దీపములు ధగధగ వెలుఁగుచుండెను. ప్రపంచమంతయు నిశ్శబ్దముగానున్న యా సమయమునఁ గొందఱు పరిచారికలుమాత్ర మెందులకో గుంపులు గుంపులుగాఁ గూడి యేమేమో ముచ్చటించుకొనుచు నటునిటుఁ దిరుగుచుండిరి. శయ్యాగృహములోనే కొంతదూరము నడచితిని. అటఁ జలువలు క్రుమ్మరించుచు ముత్యాల చప్పర మంచముపై నమర్పఁబడిన పూలపాన్పుపైఁ బవ్వళించి చింతా క్రాంతుఁడై యేదియో యాలోచించుచున్న వసురాజుం గాంచి సుగంధతైలపూరములగు భవనప్రదీపికా స్తంభములనీడల నిలచి యం దెవరును లేక రా యొంటరిగా నుండుట గమనించి యథా రూపమును స్వీకరించి పరికించి చూచితిని.

అపుడా మంచముపైఁ బవ్వళించి యుస్సురనుచుఁ, గన్ను మోడ్చుచుఁ, దలయూఁపుచుఁ నేదియో యాలోచించుకొనుచు, నల్దెసలు గనుంగొనుచుఁ బొరలుచు, లేచుచు, వడంకుచు, 'హా! ప్రసవగంధి'యనుచు, మఱలఁ బూలపాన్పుపై వ్రాలుచుఁ బెక్కు రీతులఁ దన మనోగతయగు ప్రియురాలిం దూరుచునున్న రాజచూడామణి మదనబాణహతుఁడై యుండుట గాంచి యిపుడే యీ భూపతిని బల్కరించి, నగజాత యవస్థను దెల్పి యాతని యాత్మకుఁ బండువొనర్చెదనని తలఁచియు, సందియమంది యింకను నాతని భావమును గనిపెట్టి పిదపనే నేను గన్పడఁదలంచి యా మంచమునకుఁ జెక్కబడిన యంత్రపుత్రికలగుంపులో నేనును నొక రత్నపుఁ బ్రతిమనై నిలచి పకపక నవ్వితిని. వసురాజు దిగ్భ్రాంతిఁజెంది యన్ని దిశలం బరికించెను గాని యెవరును గన్పట్టరైరి.

అపుడు నేను 'వసురాజా! బాలికామణి నేల వ్యర్థముగాఁ దూరెదవు? ఇంతులు పరతంత్రులన్నమాట మఱచితివా? కన్యకలు తలిదండ్రుల యనుమతిలేకయే తమంతట తాము ప్రియులను వరిచుంట తగవని యెంచితివా? అట్లు వరింపకుండుటయు నొక నేరమేనా? అశుభశుభముఁ దెలియని బాలికామణికిఁ బ్రేమలు గలిగించి, తీరని వెతల పాల్సేసి, తిరిగి చూడక కనికరము లేక యున్న నీయది నేరముకాదా? మహారాజులు మాయా స్వభావులును, జంచలాత్ములును, దయమాలినవారును, స్వప్రయోజనమునే చూచుకొనువారును, రాజవైభవములచేఁ గన్ను గాననివారునునై యుండుట సంభవించును గాని, యబలల కట్టి గుణము లుండుట యెప్పుడును సంభవింపజాలదనుచుఁ బల్కితిని.

ఆ మాటలు వినునప్పటి కా రాజు విస్మయాకులిత నేత్రుఁడై యీ తీరునఁ గన్పడకుండ నిలచి పల్కినది యశరీర వాణియో, చారణకన్యకయో, కిన్నరాంగనయో, దేవతావనితయో, నాగపొలఁతియో, నగజాత చెలికత్తెయగు మంజువాణియో కానో పునని యూహించి 'యీ మాటలవలన నగజాతకు నాపై గల కూరిమి గాఢమైనదని మాత్రము విశదమగుచున్నది. ఇఁక నా తాపానలంబు నసునె. నా పూర్వపుణ్యము ఫలించె. పాప మా యబల నాకై యెంత కుందుచుండెనో, యెంతగ బాధఁజెందు చుండెనో' యని విలపించుచుఁ బాన్పుపై కొఱగెను. అప్పుడు నేను మెల్లఁగాఁ జేరఁబోయి నేఁ దీసికొని వెళ్ళిన ముత్యాల హారము నాతని కంఠమున వైచితిని. వెంటనే తెలివొంది తన కంఠ సీమ నలంకరించిన హారముం గాంచి 'యియ్యది నా కంఠము నెట్లు పొందియుండును? ఈ హార మే యువతిదై యుండనోపును? ఇది నా శరీరమునకు సోఁకగానే హాయిని గలిగించుచున్నది. దీనిం జూడ నెచ్చోటనో చూచినట్లు గోచరించుచున్నది. ఆహా! నా యెదుటఁ గాన్పించు చిత్రపటమందలి నగజాత మెడలోని హారమును, నిదియు నొక్కే పోలికగ నున్నయవి. రూపమును బట్టియు, గుణమునుబట్టియు చూడ నీ ముత్యాలసర మా నగజాతదే యనుటలో నే సందియమును గాన్పింపదు' అని సంతసించుచు దాని నెదపై నుంచుకొని యానందపరవశుఁడై సుఖించుచు నిట్లు పల్కెను.

'ముక్తాదామమా! నేమమేకదా! నిన్ను ధరించు నగజాతకును, దత్సఖీతతికిని శుభమా? ఔరా! యెంతకాలమునకుఁ బ్రియసఖిని విడనాడి నా మనోవ్యథను మాన్పవచ్చితివి? నీకైన

నాపై జాలి గల్గినందులకు సంతసించుచున్నాఁడ. నీ గుణముల నేమని వినుతింతు? మణిహారమా! నగజాత మనస్సు నీకు విదితమేకదా? ఆమె నాపై నిజముగా మక్కువఁ గల్గియున్నదా? నిన్ను గొనివచ్చిన దెవరో తెల్పవా?—ఎవరని సందియమందనేల? కార్యముల నెఱవేర్చుటలో దక్షురాలైన మంజువాణియే యీ సరమును దెచ్చి నా మెడయందువైచి యీ రత్నపుత్రికా రూపముం జెందియుండనోపు. ఓ దాక్షిణ్యశాలినీ! నీ విఁక ప్రతిమా రూపమును బొంది దాఁగియుండనేల? నాయికానాయకుల జీవితములు సఖీవాక్యములపై నాధారపడియుండునుగదా! ఇఁకనైన నా కన్నులకుఁ గన్పించి నన్ను గృతార్థుంజేయు' మని ప్రార్థించెను. అపుడు నే నిదియ యదనని యెంచి యెదుటికి వచ్చి నిలచి భూపతికి నమస్కరించి 'వసురాజా! నే నచలకన్యకబోటిని. మంజువాణిని. కన్నియ స్థితిఁ దెలుప నేగుదెంచితిని. మా బాలిక నలనాఁడు మదనతాపమున కగ్గలముచేసి యింతవఱకుఁ దిరిగి చూడకుండుట తమవంటి దీనజనరక్షకులకు దగునా? ఆ సఖి మీరు వెడలినప్పటినుండియు మదనతాప మాపఁజాలక మిగుల వెతఁజెందుచు, మిమ్ములనే తలపోయుచు నిద్రాహారములనుమాని కృశించి యున్నది. మే మెంత యోదార్చినను 'గొండనుదన్నిన కఠిన మానవునకుఁ గనికరమేలనమ్మా'యని కన్నీరు విడచుచుండును. 'బహువల్లభా మనోహరుని గామించిన నాకేల యానందము కల్గును?' అని చింతించుచు వెచ్చనూర్చుచుండును. ఇది యామె వృత్తాంతము. ఇంక దేవరయే ప్రమాణ' మనుచుఁ బల్కి మిన్నకుండెను." జనపతి యామె మాటలకుఁ జిఱునవ్వు నవ్వి తదుక్తి

కౌశలమున కాత్మ మెచ్చుకొనుచుఁ దన యనురాగము వెలువడ నిట్లు పలుకనారంభించెను.

వసు:—మంజువాణీ! ఏమంటివి? నేను కఠినుఁడననియా? అట్లే యనుకొందము. కఠినుడనైన నన్ను మీ సఖి చూపులచేతనే యుఱ్ఱూఁత లూఁగించుచున్నదిగదా? ఇఁక నామె కాఠిన్య మెంతటివో వేరుగఁ జెప్పవలెనా? వసురా జాశలఁబెట్టి యేఁచుననిగదా యంటివి? మీ సఖియ రూపముచేతనే నన్ను వశపఱచుకొని యాసలపాలుచేయలేదా?

మంజు:—అవును. వశపఱచుకొనఁబట్టియే యంతిపురికి వశుఁడవై యుండుంటివి.

వసు:—సఖీ! గుణవతియైన నగజాతను వలచిన నాకితర వనితల యందుఁ బ్రేముడి యెట్లు కలుగును? ఇట్టి యనాదరపుఁ బల్కులం బల్కి నిష్కారణముగ నను వేధించనేల?

మంజు:—వసుభూపతీ! నగరవాసులగు తమకు వచనప్రౌఢిమ కొఱతయా! నగజాత యిఁక విరహానలమునకు సహింపఁ జాలదు. ఏఁచెదవో, బ్రోచెదవో జాగుసేయక తెల్పుము.

వసు:—సుదతీ! ఆమెకై నే పడు దురవస్థఁ గన్నులారఁ గాంచితివికదా? ఇంకను నను సందేహించి పాపముకట్టుకొననేల?

మంజు:—అట్టియుత్కంఠ గలవాఁడ విన్ని దినము లామెను వియోగవ్యథపాలు గావించు టెందులకు?

వసు:—నదీనందన గురుజనాధీన గాన నామెమనసుఁ దెలియఁ జాలక యిన్ని దినములు నేను వెతలఁగుందుచు నామెను వ్యథల పాలు గావించితిని. ఈనాడు నీవలన నామెమనమును గుర్తింపగల్గితిని. నా ప్రియవయస్యుఁడైన యింద్రుఁడు నా

యభిప్రాయ మెఱింగి వివాహశుభ మొనఁగూర్ప మునీంద్రు లతోఁ గలిసి శైలాధినాధునింటికి శేపో మాపో రాఁగలఁడు. ఈ శుభవార్త మీ సఖికిఁ దెల్పి యూఱడిలఁజేయుము. లెమ్ము;పొమ్ము' అని తొందరపెట్టి పంప నే వెంటనే పయనమై మనసఖి కీ సంతోషవార్త నెఱిఁగింపవలెనను నాతురతతో శీఘ్రముగా నిట కరుదెంచితిని.

మనసఖి పొందు మదనతాపముకంటె మహారాజు పొందు చున్న మనోవేదన వర్ణింప నలవికానిది. ఆతఁడు స్వభావముచే ధీరుఁడయ్యు నేలొకో యంతటి భీరుఁడై వాపోవుచున్నాఁడు. రాజ్యభోగముల ననుభవించుచు నంతఃపుర జనముతో సుఖించు చున్న రారాజీ నదీజాతయగు సఖిని బ్రేమించుటయు, స్వభవ నమునకు వెడలి సమస్తసుఖముల ననుభవించుచుండియు మన సఖి విషయము మఱువక యారీతి వియోగబాధ ననుభవించు టయుఁ జూడ నా మహనీయుని పూతచరిత్ర మెట్టిదో వెల్లడి యగుచున్నది. ఆతఁడు సుగుణరత్నాకరుఁడు, విశ్వాసపాత్రుఁడు ననుట కింతకంటె నిదర్శన మేమి కావలెను? ఈ మహిమందిర మున మన నగజాతం జూచి వెళ్లినప్పటినుండియు రాణి వాసముతోఁ బల్కక, రాచకార్యములపై మనమిడక బాధనొందు చున్నాఁడు" అని వసుభూపతి సుగుణములు వర్ణించి చెప్పుచుం డఁగా నా మాటల కడ్డువచ్చి యితర చెలికత్తియ లిట్లు ప్రశ్నింప నారంభించిరి.

ఇత:—మంజువాణీ! రాజుగా రంతటి ప్రేమగలవారేయైన నింత పఱకుఁ దిరిగి రాకుండుటకుఁ గారణమేమి ?

మం:—చెలులారా! మనసఖి మదనతాప మనుభవించుచున్నను వసురాజుం దర్శించుటకేల వెడలలేదో మహారాజు రాకుండుటకు నదియే కారణము.

ఇత:—ఈ కారణ మెట్లు సరిపడును? పురుషులు స్వతంత్రులు కదా? వారు నాయికను దర్శించుట సులభకార్యమగునుగాని, యస్వతంత్రులగు నబలలు నాయకుని దర్శింపనేగుట యెట్లు సంభవించునో చెప్పుము.

మం:—అస్వతంత్రురాలు కనుకనే తాను వచ్చినను ప్రయోజన ముండఁజాలదని యెంచియే మహారాజు వచ్చుట మానివైచి నాఁడు.

ఇత:—మంజువాణీ! యెంతటి యుపాయశాలివమ్మా! రాజు గారిపై నీఁగనుగూడ వాలనీయనట్లున్నావే. నీ కాతనిపై నింతటి యభిమానమేల? కానిమ్ము. మహారాజుగారు గుర్తనకేమైన వస్తువును పంపియుండిరా?

మం:—పంపకేమి? ఇదిగో యీ యుంగరము నొసగి 'దీనిచే మీ చెలినూరడిలంజేయు' మనుచు వచించి నన్ను తొందరపెట్టి పంపెను అని నుడువుచు నా యుంగరమును నగజాత కొసంగెను. ఆమె యానందముతో నా యుంగరమును జేకొని కన్నుల కద్దుకొని యేకాంతగృహముంజేరి, యా ముద్రికపై నున్న వసురాజు పేరును గాంచి, తనపై మహారాజునకు దయ కల్గుటకు సంతసించి లజ్జ యతిశయింప నా యుంగరమును వ్రేలికిఁ దొడుగుకొనెను. వెంటనే యామెకు వసురాజకర గ్రహణ మొనర్చునట్లు తోప నానందముతో మైమఱచి యుండెను.

# 13

వసురాజు నగజాతను బాణిగ్రహణమగునను వృత్తాంతము చెలికత్తియ లెటింగినంతనే సంతసమంది తమసఖికిఁ దగిన వరుఁడు లభించినందులకు నుప్పొంగిపోవుచుండిరి. ఇట్టి ఘనకార్యము నెఱవేర్చినందులకు మంజువాణిని గొనియాడుచుండిరి. ఇంద్రాదులువచ్చు దినము మఱునాఁడే యగుట నీ వృత్తాంతము నామె తలిదండ్రులకుఁ జెప్ప నుత్సహించి యెల్లరును గుమికూడి మున్ముందు తల్లియైన శుక్తిమతికడకు వెడలి వసురాజు మణిగృహమునకు వచ్చినప్పటినుండియు నేఁటివఱకు జరిగిన యుదంతము నంతయుఁ జెప్పిరి. అపుడు శుక్తిమతి తన యనుంగు బిడ్డకు రూపవంతుఁడును, గుణవంతుఁడును, బరాక్రమవంతుఁడును, నైశ్వర్యవంతుఁడును నగు వసుమహారాజు భర్తకానుండుటకు సంతసచిత్తయై యప్రయత్నముగా నిట్టివరుఁడు తన ముద్దుల బిడ్డకు లభింపనున్నందులకు సంతసముతో మిన్నంటుచుండెను.

పిదప నా చెలికత్తెలు కోలాహలునిఁజేరి జరిగినదంతయు బూసగ్రుచ్చినరీతి వచించి, వసురాజుపక్షమునఁ గన్యక నడుగుటకై యింద్రుఁ డీ దినముననే దిక్పాలురతోఁ దమకడకు రానున్నాఁడనియుఁ జెప్పి వెడలిపోయిరి. కోలాహలుఁడు మహాపరాక్రమవంతుఁడగు వసురాజు తన కల్లుఁడు కానున్నందుల కపరిమితానందమునొంది, యింద్రునిరాకకై యెదురుచూచుచుండెను.

సఖులు శుక్తిమతీ, కోలాహలులకా సంతోషవార్త నెఱిఁగించి, మణిమందిరమునకు వెడలి, ప్రియసఖితో నా రాత్రి యంతయు సరససల్లాపము లాడుచు మహదానందముతోఁ గాలముఁ గడపుచుండిరి. వారి కానాఁటి రాత్రి క్షణకాలముగఁ గడచిపోవుచుండెను. అంతలోఁ గుక్కుటములు కూయ నారంభింపఁ దెల్లవారనున్నదని యెల్లరు సంతసమందుచుండిరి. చంద్రుడు నగజాత తిట్లకుఁ గళావిహీనుఁ డయ్యెనా యన్న పగిది వెలవెలపోవుచుండెను. మఱియు నాతఁడు దనకు గల్గిన యీ యవమానమునకు మేనఁ బ్రాణములు నిల్ప నొల్లక సముద్రమున దుముకుటకై యున్నతప్రదేశ మెక్కెనా యన్న పగిది పశ్చిమగిరిశృంగ మారోహించెను. నక్షత్రము లన్నియుఁ గాంతిహీనములై యాకసమున మినుకుమినుకు మనుచుండెను. దిక్కు లన్నియు వెలవెలఁబాఱుచుండెను. పక్షులు కిలకిలారావములు సేయుచుఁ దమతమ గూండ్లను వీడి యాహారమునకై నలు దిక్కులకుఁ బర్వ నారంభించెను. లోకబాంధవుఁడు లోకరక్షకులైన నగజాతావసురాజులను సంతసింపఁ జేయఁ బూర్వాద్రిపైఁ గనుపట్టెను. చెలికత్తియలు ప్రబోధింప నగజాత మేల్కాని పూలపాన్పు డిగ్గి ప్రసన్నమైన మోముతోఁ బ్రాతఃకాలకృత్యములం దీర్చి తలిదండ్రులకడ కేగి వారికి నమస్కృతులొనర్చి వచ్చి చెలికత్తియలతో ముచ్చటలాడుచు వసురాజసందర్శనమున కెదురుచూచుచుండెను.

దేవలోకమునుండి యింద్రుఁడు దిక్పాలురతోను, సప్త మహర్షులతోను, నరుంధతి మున్నగు పుణ్యాంగనలతోను విమానారూఢుఁడై వచ్చి యా గిరివర సమీపమున దిగెను. అపుడు

కోలాహలుఁడు పెండ్లికార్యమునకై వచ్చిన యింద్రాదిదేవత లకు భార్యతోఁగూడ నెదురేగి వారిం బూజించి తన గృహమున కుం గొనివచ్చి యగ్రాసనములపైఁ గూర్చుండఁజేసి దంపతు లిరు వురును సవినయముగ దోసిలొగ్గి 'యింద్రాది మహానుభావులారా! మీ రాకవలన మా గృహమును, జన్మయుఁ బవిత్రములైనవి. మీ యాగమన ప్రయోజనముం దెల్పి మము ధన్యులం జేయుఁ' డని వేడుకొనిరి. ఇంతలోఁ దలిదండ్రుల యాజ్ఞప్రకారము నగజాత సఖులతోఁగూడ వచ్చి యా దేవతా బృందమునకు నమస్కరించి వినయముతో నొదిగి తల్లిదండ్రుల కడ నిలచి యుండెను. అపుడు వారెల్లరు నా బాలికామణి సౌశీల్యసౌకు మార్యాది గుణములకు మెచ్చుకొనిరి. అరుంధతి యా బిడ్డను జేరఁదీసి కౌఁగిలించుకొని 'బిడ్డా! నిన్ను గన్న తల్లిదండ్రులే లోకము లన్నిటిలోను ధన్యు'లని పొగడెను.

అంతట నింద్రుని యనుమతిపై వసిష్ఠుఁడు కోలాహలుం గాంచి 'నగాధిరాజమా! మీ బిడ్డ రాజాధిరాజులచే నమస్కరింపఁ బడుచు సన్మార్గ ప్రవర్తకుఁడై మహా ప్రతాపాన్వితుఁడగు వసు రాజును జేపట్టి శివుని బరిణయమాడిన పార్వతివోలె సర్వమంగ ళయై లోకుల మన్ననలం బడసి భోగభాగ్యముల ననుభవించుచు సుఖించునుగాక! ఇదియే మా యాగమన ప్రయోజన' మని పలుకఁ గోలాహలుఁడు వసిష్ఠుని యాశీర్వాద రూపమైన యాజ్ఞా వచనమునకుఁ గడుంగడు సంతసించి యింద్రునకుఁ గృతాం జలియై 'శచీపతీ! చేది భూపతియొక్క కాలి బొటనవ్రేలి దెబ్బచే దూలి దిక్కుమాలియున్న నన్ను మీ పాదరజముచే ధన్యుం గావించితి'రని దీనుఁడై పల్కెను.

అపు డింద్రుఁ 'డచలేంద్రా! నీ తండ్రియైన హిమవంతుఁడు యజ్ఞముల యందలి హవిస్సును భుజించువాఁడు. దేవత లెల్లరిలో మేటి. అట్టివాని కడుపునఁ బుట్టిన నీకుఁ గీర్తి గౌరవములకుఁ గొఱతయా! వసురాజుచేఁ గావింపఁబడిన యవమానము పోకార్చుటకే యీ పుత్రిక నీకు జనించినది. కనుక నీ బాలికామణిని నా మాటఁ బాటించి వసురాజున కిచ్చి పెండ్లిచేసి సమస్త లోకముచేఁ బూజనీయుఁడవై కీర్తి ప్రతిష్ఠలం బడయుము. ముల్లోకములచే నుతింపఁ బడుచు సమస్త ప్రపంచమున కేలికయైన వసునాధుఁ డల్లుఁడగుట నీ మహాభాగ్యము కాదే! కాలఁదన్ని నిన్ను మించిన యా వసురా జిప్పుడు నీ పాదద్వయమునకు మ్రొక్కువాఁడు కానున్నాఁడు. కావున నా చెప్పిన చొప్పున గావించి లోకారాధ్యుఁడవై మన్ననలం బడయు'మని పల్కెను. కోలాహలుఁ డధికహర్షమునొంది యింద్రునకు నమస్కరించి 'అయ్యా! తమయాన శిరసావహించి పాలించెదను. ఒక దేవత ప్రత్యక్షమైననే సమస్త కామితార్థములు లభించునని పెద్దలు పలుకుదురు. ఇపు డిందఱు వేల్పులతోఁగూడిన మీరు ప్రత్యక్షమగుటచే నా తలంపులు ఫలించుటలోఁ గొదువయేమి? వసురాజు కన్యక నడిగించువాఁడును, దేవరాజ్యాధిపత్యము వహించిన మీ రడుగువారును గాఁగా నా కింతకంటె శుభ మేమి కావలెను? వసురాజునకు నా కన్యక నిచ్చి వివాహముచేయుట సర్వథా సమ్మతమే' యని వచించెను.

అపుడు తండ్రిప్రక్కన నిలచిన నగజాత లజ్జచేఁ దల వంచి తన కోర్కె యీడేరనుండుట కెంతయు సంతసించుచుండెను. ఇంద్రుఁడు శుక్తిమతిం జూచి 'మహాసాధ్వీ! యింద

నీ యభిమత మే' మని యడిగెను. 'నా కీ విషయమున భిన్నాభిప్రాయ మెప్పుడును లేదు. మీ యాజ్ఞ శిరసావహించి యంగీకరించుదాన'నని సమాధాన మిడెను. వా రిరువురి యంగీకారములం గని పిదప నింద్రుఁడు ముహూర్తము నిర్ణయింప బృహస్పతిని వేడుకొనెను. సర్వశాస్త్రవేత్తయగు దేవగురువు బాగుగాఁ బరిశీలించి 'యింద్రా! యీనాఁటి రాత్రి మిధునలగ్న మన్నివిధములఁ దగియున్న'దని తెల్పెను. ఇంద్రుఁడు ముహూర్త మాసన్నమైయుండుట మదిఁ దలంచి 'కోలాహలా! మా ప్రభావము వలన వివాహ ప్రయత్నములన్నియు వానియంతట యవియే సిద్ధములగును. మీరు మనమునఁ దలఁచినంతనే మీ మీ బంధువులెల్లరు క్షణమాత్రములో వచ్చునట్లు వరమిచ్చుచున్నాఁడ. భయపడక సిద్ధముగా నుండుఁ'డని యాజ్ఞాపించి, వసురాజున కీ వృత్తాంతముఁ దెల్పి వానిం దీసికొనిపచ్చుటకై యెల్లరతో బయల్వెడలి క్షణమాత్రములో నధిష్ఠానపురముం జేరెను.

వసురా జింద్రాదులకు నమస్కరించి నిలచియుండ నెల్లరును 'పెండ్లికొడుకవు క'మ్మని దీవించిరి. ఇంద్రుఁడు తన వెయ్యి కన్నులతో నొక్కపరి వసురాజుం గాంచి 'రాజచూడామణీ! నిన్నటి సాయంకాలము నేను సభాభవనమునఁ గొలువు తీరి యచ్చెరమచ్చెకంటు లాడుచుండఁగను, గిన్నరులు వీణియల మీటుచుఁ బాడుచుండఁగను గని విని యానందించుచు నా ప్రియమిత్రుఁడవగు నీవు రాకుండుటకుఁ గారణ మేమాయని తలంచి నా దివ్యదృష్టిచే నీ మనమున నెలకొనిన విచారముం గమనించి, అయ్యో! నా చెలికాఁడు మదనతాపమునకు గుఱియై తీరని వగలఁ గుందుచున్నాఁడు. ఎట్లైన నాతని కోర్కె

యీ దేర్పవలెనని యెంచి యీనాఁటి ప్రాతఃకాలముననే దిక్పాలురతోను, సప్తమహర్షులతోను బయలుదేఱి శీతనగ పుత్రునికడకు వచ్చి, నీకుఁ గన్నియ నిచ్చునట్లు వేఁడి, యొప్పించి, బృహస్పతిచే సుముహూర్తమును నిర్ణయింపఁజేసి లగ్న మీనాటి రాత్రి మిధునమునకే యగుటవలన సత్వరముగ సర్వప్రయత్నములు సిద్ధముచేయవలసినదని యానతిచ్చి, నీ కా వృత్తాంతమును దెల్పి పెండ్లికొడుకుం గావింప నేతెంచితిమి. మా ప్రభావమువలననే రాజలోకమంతటిని వివాహమునకు రప్పింతుము; సందియమొందకు'మని వినిపించెను.

రాజు వికసితాననుఁడై లోలోన సుప్పొంగుచునుండెను. అంతట మంత్రి పురోహిత దండనాయకులు వివాహసన్నాహములు సేయుటకును, సమ్మోహనగరము నలంకరించుటకును బరిచార కుల కాజ్ఞాపింపఁ గొందఱు వెడలి నగరమంతయుఁ జలువపంది ళ్ళతోను, బచ్చలతోరణములతోను, నరటికంబములతోను నలం కరించి స్వర్గపురముతో సమానముగ నుండునట్లు చేసిరి. మఱి కొందఱు వివాహ సంభారములన్నిటిని సిద్ధపఱచిరి. దేవతా ప్రభావముచే సమస్తదేశాధీశులు క్షణకాలములో వచ్చి విడసిరి. అపుడు వేడుకచెలికాఁడు వచ్చిన రాజులకుఁ దగిన మర్యాదలు చేయుచుండెను. అరుంధతి మున్నగు ఋషిపత్నులు మంగళద్రవ్య ములను బళ్లెరములయందు సిద్ధముచేసియుంచిరి. గాయకులు గానములు చేయఁదొడంగిరి. వైణికులు వీణియల మీటుచుండిరి. వాంశికులు పిల్లనగ్రోవుల నూఁదుచుండిరి. ఈ విధముగ నగర మంతయు క్షణకాలములో మంగళనాదములతో ఘోరుచెలంగినదై యుండెను.

ఈ సమయమున నంతఃపురాంగనలు చేది భూకాంతుని బెండ్లికొమరునిజేయ సంకల్పించిరి. ఒకర్తు భూకాంతునకు సుగంధతైలముతోఁ దలయంటెను. వేరొక యువతి పన్నీటిచే జలకమాడించెను. మరియొక లేమ తెల్లనివస్త్రములతోఁ దడి యొత్తెను. మఱియొకతె దువ్వలుపలు గట్టనిచ్చెను. ఇంకొక తరుణి యాభరణములచే నలంకరించెను. మఱియొక తన్వి మేన మైపూతల నలందెను. వేఱొకతె నొసటఁ బచ్చకప్పురపు నెల వంక నామమును గీలించెను. దేవతావనితలు హారతులుపట్టిరి. గంగ మున్నగు పుణ్యకాంతలు పాటలు పాడుచుండిరి. భూసురు లాశీర్వదించి యక్షతలం జల్లిరి. అచ్చట వైజయంతీ మాలిక లతోఁ బ్రకాశించు వివాహవేదికపై ముత్తైదువలెల్లను పాటలు పాడుచుఁ బెండ్లికొడుకుం గూర్చుండబెట్టిరి. అపుడు కుబేరుఁడు రత్నాలకిరీటము నొసంగ వసురాజు భక్తితో నద్దానిని శిరమున ధరించెను. శచీదేవి దివ్యదామములతో సిద్ధముచేసి యనిపిన బాసికమును బుణ్యాంగనలు వసురాజు నొసటఁ గట్టిరి. వరుణుఁ డంపిన ముత్యాలహారమును గంఠమున వైచిరి. గరుత్మంతుఁడు గరుడపచ్చలు చెక్కిన యంగదములను, మేఘుఁడు వైడూర్య మణిఖచితములైన కంకణములను, నలకూబరుఁడు కెంపుల గండ పెండెరమును, జయంతుఁడు బంగరు జరీపనిచే నిగనిగలాడు చంద్రకావి పట్టుపుట్టమును గానుకగా నొసంగిరి. వాని నన్నిటిని వసురా జందుకొని తగినరీతి ధరించి లక్ష్మిపెండ్లినాఁడు విష్ణువు వోలెఁ బ్రకాశించుచుండెను.

అట కోలాహలుఁడు తనపట్టణమంతటిని నింద్రుఁడిచ్చిన వర ప్రభావముచేఁ ద్రుటికాలములో నలంకరింపఁజేసెను. శుక్తిమతీ

కోలాహలులు తమ మనములఁ దలఁచినంతనే సమస్తనదీనదంబులును, గులపర్వతంబులును వచ్చి చేరెను. మంజువాణిమున్నగు చెలికత్తియలు నగజాతను బెండ్లికూఁతుఁ జేయఁ గుతూహలము కలవారలై జలక మాడించి, సమస్త రత్నాభరణములతోను, దువ్వలువలతోను నలంకరించి, నొసట గళ్యాణపు బొట్టుపెట్టి, మేన గంధమలంది, తాత తెచ్చిన బాసికమును నొసటఁ గట్టి, పాటలు పాడుచు, హారతులు పట్టి వివాహమందిరమున నమర్పబడిన కెంపుల యరుఁగుమీఁది వజ్రపీఠికపైఁ గూర్చుండఁబెట్టిరి. సర్వము సిద్ధముకాఁగా వధూబంధువులు పెండ్లికొడుకువారి రాకకై యెదురుచూచుచుండ సూర్యుఁ డస్తమించెను.

అట నధిష్ఠానపురమున బృహస్పతి ముహూర్తము సమీపించుచున్నదని హెచ్చరింప నింద్రుఁ డెల్లరఁ దొందరపెట్టి ప్రయాణమునకు సిద్ధముచేసెను. వివిధ వాయిద్యములు మ్రోయింప నారంభించిరి. వందిమాగధులు స్తోత్రములు సేయఁ దొడకొనిరి. పుణ్యాంగనలు మంగళసంభారములం గ్రహించి పాటలు పాడ మొదలిడిరి. పురోహితుండైన వసిష్ఠుఁడు వేద మంత్రములను బఠించుచు ముందు నిలచియుండెను. ఇట్టితఱి వసురాజు పెండ్లిపెద్దయైన యింద్రుని యాజ్ఞచొప్పున నలంకరింపఁబడిన భద్రగజముపై నధిష్ఠించి యనన్య సామాన్య మహా విభవంబున వధూగృహమునకు బయలుదేఱెను. బందుగు లెల్లరు వాహనములఁమీఁదను, బండ్లమీదను నెక్కి మహదానందముతోఁ గదలిరి. ఆ సమయమున నా పట్టణమందలి యతివ లెల్లరు తమ తమ సౌధోపరిభాగముల నెక్కి మదనుని దిరస్కరింపఁజాలిన యా సుందరుని బరమానందభరితులై చూచుచు మంగళలాజలం

జల్లుచుండిరి. ఇవ్విధముగాఁ బురంబు నిర్గమించి యనేక పట్ట ణంబులను, జనపదంబులను నింద్రుని మహిమచే క్షణకాలములో దాటి కోలాహలుని పురబాహ్యాంగణమున విడిసిరి.

దిక్కులు బ్రద్దలగునట్లు మ్రోగుచున్న వాయిద్యములను విని కోలాహలుఁడు పెండ్లికొడుకువారు వచ్చిన ట్లెఱింగి సమస్త బంధువులతో బయలుదేఱి వచ్చి యింద్రాదుల నుచితరీతిఁ బూజించెను. అంతటఁ జందన తాంబూలాదులతోఁ బరస్పరము సమ్మానించుకొనిరి. పిమ్మట నద్రిరాజు సంబంధులను దన పట్టణము లోనికిఁ దీసికొని వెడలి విడిదిగృహమున దింపెను. అంతట వధూబంధువులు వరుని గన్యాగృహమునకు మంగళ వాయిద్యములతోఁ గొంపోయి మంగళస్నానమును జేయించిరి. ఈలోపల వలసిన పరికరముల నన్నిటిని సమకూర్చుకొని యింద్రాదు లెల్లరు కన్యకగృహముం జేరిరి. ముహూర్త మాసన్నమైనదని దేవగురువు తొందరపెట్టఁ బెండ్లికుమారుని వివాహవేదికపైఁ గూర్చుండఁబెట్టిరి. వసిష్ఠుడు బ్రహ్మపీఠ మలంకరించి పుణ్యాహవాచనాదికర్మల నెఱవేర్చి కన్యకం గొనిరా నాజ్ఞాపించెను. అంతట వధూబంధువులు మంగళవాయిద్యములు మ్రోగుచుండ బెండ్లికూఁతుం గొనివచ్చి వరున కెదురుగా నుపవిష్టుఁడై యున్న కోలాహలుని యంకతలమునఁ గూర్చుండఁబెట్టిరి. వధూవరులకు నడుమ తెరచీర పట్టుకొనఁబడెను. అప్పుడు పురోహితుఁడు మంగళాష్టక చూర్ణికాదులఁ బఠించి కన్యాదానము చేయవలసినదిగఁ గోలాహలున కాజ్ఞాపించెను. అంతటఁ గోలాహలుఁడు శుక్తిమతి నీరముఁ బోయుచుండ ధారాపూర్వకముగాఁ దన ముద్దుల బిడ్డ యగు నగజాతను వసురాజున కొసంగెను. పిదప గురునానతిపైఁ

పెండ్లికుమారుఁడు కన్నియపాణిం గ్రహించెను. వసిష్ఠుఁడు మాంగల్యదేవతాహ్వానముచేసి పూజాపునస్కారాదులు జరిపించిన పిదప వసురాజు నగజాత కంఠమున మంగళసూత్రముం గట్టెను. ఆ సమయమున నాకసమునుండి పుష్పవర్షము కురిసెను. దేవ దుందుభులు మొఱసెను. లోకమంతయు సంతసముతో నుబ్బిట్లూఁగుచుండెను. తదనంతరము వధూవరు లొండొరుల శిరములపైఁ దలఁబ్రాలు పోసికొనిరి. అంతట వసిష్ఠుఁ డాశీర్వచనమంత్రములం జెప్పి వధూవరుల నాశీర్వదించెను. సభికు లెల్లరు 'తథాస్తు' నుచు వాకొనిరి. తెల్లవారునప్పటి కిట జరుగవలసిన కర్మ పూర్తి కాఁగాఁ బురోహితుఁడు వధూవరులతోఁగూడ నగ్నిశాలం బ్రవేశించి యం దగ్నిప్రతిష్ఠాపనాదులఁ గావించి యగ్నికార్యమును బరిసమాప్తిఁ జేయించెను. ఇట్లా వివాహకర్మ ముగియగనే యద్రిరాజు బంధుగుల నెల్లర భోజనాదులచే సంతృప్తి పఱచి చందన తాంబూలాదుల నొసంగి సత్కరించెను. అంతట నింద్రాదులు వధూవరులఁ బెక్కుతెఱంగుల నాశీర్వదించి, యమూల్యములగు వస్తుతతిచే సత్కరించి తాము తమ లోకమునకు వెడలుటకై వసురాజును వేడుకొనిరి. అప్పు డాతఁ డెల్లర నమూల్యములగు వస్తు వాహనాదులతో సత్కరించి పంప యింద్రాదులు తమతమ వాహనము లధిష్ఠించి దేవలోకమునకు వెడలిరి.

పిదపఁ గోలాహలుఁడు తన బంధువుల నెల్లర నర్హవిధి సమ్మానించి పంప నందఱును దమతమ దేశములకుఁ జనిరి. అంత నర్మసచివుని వస్త్రాభరణాదులతో సత్కరించి సంతృప్తి పఱచెను. అటుపిమ్మట జామాత నధికముగ గౌరవించి, కుమార్తెకుఁ బరిచారికలను, ప్రియసఖియగు మంజువాణిని వస్త్ర

భూషణాదులను నొసంగి పెక్కునీతులం గఱపి పయనముం జేసెను. అనూనహర్షాతిశయముతోఁ బరివారము వెంటవచ్చుచుండ వసురాజు నగజాతతోఁగూడ విమాన మధిష్ఠించి తన రాజధాని పట్టణమగు నధిష్ఠానపురవరముం జేరెను. అట మహారాజు గురు, బుధ, కవిసమాజమునకు వస్త్రాలంకారాదుల నుచిత రీతి నొసంగి సంతృప్తిపఱచి యా నూతనప్రియతో సమస్త సుఖము లనుభవించుచు నామె నెక్కుడు మక్కువతోఁ జూచుచుండెను. నగజాతయుఁ బతిభక్తి కలదియై తన గానకళావిజ్ఞానముచే వసురాజును సంతోషపరవశుం గావించుచు ననుకూలవతియై మెలఁగుచుండెను. ఈరీతి వసుభూపతి సంతసమందుచుఁ బ్రజలను గన్నబిడ్డలవలెఁ బాలించుచు లోకోత్తరుఁడై వాసిఁగాంచుచు సాటిలేని మేటి సిరులతో నలరారుచుండెను.

# 14

కశ్యపమహర్షి మాధవశర్మ కీ విధముగా నగజాతపరిణయో దంతమును జెప్పి ముగించునప్పటి కా బ్రాహ్మణ వటువునకుఁ బూర్వజన్మ స్మృతికల్గి యెల్ల రచ్చెరువొంది చూచుచుండ వెంటనే రూపపరిణామముం బొంది గంధర్వరూపమును ధరించినవాఁడై కాంతిపుంజములతోఁ బ్రకాశించుచుండెను. ఔరా! మహాసాధ్వుల ప్రభావము వర్ణనాతీతముకదా! వారి చరిత్రలు కల్మషహరములు. వారి దర్శనములు పుణ్యప్రదములు. ఈ నగజాతా మహాసాధ్వి చరిత్రము సీతానసూయాది మహాపతివ్రతల చరిత్రముతో సరి పోలియున్నది. అట్టి ప్రభావము కల్గియుండుటవలననే యీ నగ జాతాపరిణయచరిత్రము శాపహరమై సన్నుతికెక్కెను.

అంత గంధర్వరూపము నొందిన మాధవశర్మ తన కా యువతీపరిణయ వృత్తాంతమును జెప్పి శాపవిముక్తుం గావించి నందుల కెంతయు ముదమంది, యా మునిసత్తమునకుఁ బ్రదక్షిణ నమస్కారంబులు చేసి దోసిలొగ్గినవాఁడై 'మునిసత్తమా! మీ యుపకారము మఱువరానిది. మీ యనుగ్రహమువలనఁగదా కర్మబద్ధమైన మానవజన్మను బరిత్యజించి దివ్యరూపమును బొందఁగల్గితిని. ఇట్టి మీ యమూల్యమగుఋణ మేనాఁ డెట్లు తీర్చు కొనఁగలవాఁడను? నా యిదు నమస్కారముచేతనే ఋణ విముక్తునింగావించి నను ధన్యుంజేయుఁ'డనుచుఁ బ్రార్థించు చుండెను.

ఇట్లు ప్రార్థించుచుండఁగనే యా మునివల్లభుఁడును ముని రూపమును విడనాడి శిష్యులెల్లరు దిగ్భ్రమఁజెందుచుండ దేవతా రూపమును ధరించి దివ్యకాంతులతో విరాజిల్లుచు నా గంధర్వ కుమారునకు వందసమాచరించుచు నిలుపంబడియుండెను. శిష్యు లెల్లరు నమూల్యోపదేశములు చేయు గురువర్యుఁడు రూపాంత రముఁ జెందుటకు దుఃఖించి 'మహాత్మా! మీ సేవయే పరమా వధిగ భావించి మిమ్ముల విడువక గొల్చుచున్న మమ్ము విడనాడిన మాకు దిక్కెవరు? మముఁగూడ మీతోఁ గొంపోవుఁడనుచు దీనులై వేడ రూపాంతరమందిన యా ముని 'పూజ్యులారా! మీర లీ శరీరముతో మా లోకమునకు రాఁజాలరు. రాఁబోవుజన్మమున దేవతారూపములంబొంది స్వర్గలోకమున సుఖించుదురుగాత:' మనుచు పరమొసంగి యోదార్చెను. రూపాంతరమొందిన మాధవ శర్మ మునియు రూపపరిణామమును జెందుట కాశ్చర్యపడి 'మహాత్మా! మీ రెవరు? ఈ మునిరూపముతో మఱుఁగుపడియుండ నేల? ఇపు డీ దివ్యరూపము నేల పొందితిరి? తమచరిత్ర యాశ్చ ర్యమును గలిగించుచున్నది. ఇట్టి మీ యద్భుతచరిత్రముం జెప్పి నను ధన్యుంజేయుఁ'డని వేడుకొనెను. అంతట నా దేవతాపురు షుఁడు తన వృత్తాంతము నీవిధముగాఁ జెప్ప నారంభించెను.

"గంధర్వరాజా! నేను పూర్వజన్మమున హేమకూటుడను పేరుగల యొక త్రిదశుఁడను. నాకుఁ జాలకాలమునుండి సంగీత విద్యయం దాదర మధికముగా నుండెడిది. కాని యితర వ్యాసం గములలో నిమగ్నుఁడనగుటవలనను, దగినయొజ్జ లభింపకుం డుటవలనను సద్దాని నభ్యసింప వీలుగలుగలేదు. కాని వినికిడి పాండిత్యముమాత్ర మే స్వల్పముగానో యబ్బియున్నది. ఇట్లుండ

నొక దినమున నింద్రునికొలువులో నారదుని గానసభ జరుగునని స్వర్గలోకమునఁ జాటించుచుండ విని, వారి గానవిద్యామాధుర్యముం గ్రోలి యానందింపఁ గుతుకముకలవాఁడనై మున్ముందుగానే సభకు వెడలి వేదికకు సమీపముగాఁ గూర్చుంటిని. కొంత కాలమునకు నారదుఁడు వీణెయతోఁగూడ వచ్చి సభావేదిక నలంకరించి, వీణెను శ్రుతిచేసి యద్దానిని మీటుచు, నా నాదముతో గాత్రమును మేళవింపఁజేసి గానముచేయ నారంభించెను.

వారి గానమాధుర్యమ్ముం గ్రోలి సభలోనివారెల్లరు చిత్రప్రతిమలరీతి నిశ్చేష్టులై యుండిరి. అందు నాకు శాస్త్రసిద్ధమైన పాండిత్యము లేకుండుటవలన వారిగానములోని విశేషములు గోచరింపలేదు గాని, చెవుల కింపుగనుండి నా హృదయమును మాత్ర మయ్యది యాకర్షించెను. తర్వాత నారదమహర్షి గానమును ముగించి యింద్రునిచే సత్కరింపఁబడినవాఁడై యట నుండి బయలుదేఱి భూలోకమునకుఁ బయనమై వెడలసాగెను. నేనును వారిని వెంబడించి కొంతదూరము వెళ్ళితిని. నే నట్లను సరించి వచ్చుటం గాంచి 'ఓయీ! నీ వెవరవు? ఏల యిట్లు నన్నను సరించి వచ్చుచుంటి'వని యడిగెను. అపుడు నేను 'అయ్యా! హేమకూటుఁడను పేరుగల విబుధుఁడను. నాకు సంగీత మభ్యసింపవలెనను కుతూహలము మెండుగఁగలదు. కాని యింతవఱకుఁ దగినగురువు లభింపకుండుటచే దానిని సాధింప వీలుపడినదికాదు. ఈనాఁడు తమగానామృతము నాస్వాదించి మహదానందము నొంది మీరే తగినయొజ్జలని యెంచి మీ శుశ్రూషచేసి సంగీత మభ్యసింపఁదలంచి మిమ్ముల నడుగ భీతిఁజెంది యిట్లు మీతోఁగూడ వచ్చుచుంటిని. దయచేసి నన్ను శిష్యునిగా గ్రహించి

సంగీతవిద్యాభిక్ష పెట్టి నా యభీష్ట మీడేర్పు'డని ప్రార్థించితిని. నారదమహర్షి దయతో నందుల కంగీకరించి వెంటనే నన్ను శిష్యునిగా గ్రహింప, నటనుండి వారిశుశ్రూషఁ జేయుచు వారు వెళ్ళిన ప్రదేశములకెల్ల వెడలుచునుంటిని.

ఈరీతి నొక వత్సరకాల మడుగిడినచోట నడుగుపెట్టక, యేగినచోటి కేగక, వెడలినరాజసభకు వెడలక, చొచ్చిన లోకమును జొరక వారితోఁగూడ దేశసంచారమునుఁ గావించితిని. కాని యంతవఱకు నిసుమంతేనియు నా కా విద్యయందుఁ బ్రవేశము కలుగకుండెను. వారిమూటలు మోయలేక నా భుజములు కాయలు కాచుటయే నాకుఁ గలిగిన లాభము. వారితో నేమియుఁ బలుకజాలక యట్లే తిరుగుచు నొకపరి బ్రహ్మలోకమున కేగితిని. అట నంతకుఁబూర్వమే బ్రహ్మసభలోఁ దుంబురుఁడు గానముచేసి వెడలెను. ఎక్కడఁజూచినను గుంపులు గుంపులుగాఁ జేరి తుంబురుని గానకళాప్రాశస్త్యమునుగూర్చియే ముచ్చటించుకొనుచుండిరి. నే నొకగుంపులోనికి వెడలి వారు ముచ్చటించు విషయములను దెలిసికొని, వారియునికి యెట్టిదని యడిగితిని. ఆ మహానీయుఁడును దేశసంచారియేయైనను నారదునివలె నెల్లపుడుఁ దిరుగక యవసరమైనపుడుమాత్రమే యెటకైన వెళ్ళివచ్చుచుండునని యందొకఁడు వచించెను. నారదునితోఁ దిరిగితిరిగి కాళ్లు బలపములుకట్టినందున వారియనుమతితోఁ దుంబురునికడఁ జేరి విద్య నభ్యసింతమని యెంచి యొకనాఁడు దారినడచునపుడు నారదునకు నమస్కరించి 'మహాత్మా! తమకడ విద్యాభ్యాసమునకై చేరి యొకసంవత్సరము దాటినది. ఇంతవఱకు నావగింజంతవాసియు విద్య నా కలవడలేదు. మీరు సర్వదేశసంచారులు. మీతోఁ దిరుగ

లేక ప్రాణము వేసరిపోవుచున్నది. తుంబురులవారును సంగీత విద్యయందు మంచి పాండిత్యముకలవారఁట. వా రెచ్చటను దిరుగక యొకచోటనే యుందురఁట. తమయనుమతియైన వారికడఁ జేరి విద్య నభ్యసింతును. మిమ్ములను శ్రమపెట్టుటకు నా కిష్టము లేదు' అని ప్రార్థించితిని.

తుంబురునిమాట వినునప్పటి కా మహర్షి మండిపడి 'యోరీ! గురుద్రోహీ! నాకడఁ దుంబురుని బెద్దఁజేసి పొగడి న న్నవమానపఱచితివి. కావున నీవు పాపభూయిష్ఠమైన మానవ జన్మ మెత్తుదువుగాక' మని శపించెను. పులిపోయి గిలిపట్టినట్లు లేనిసంగీతము లేకపోఁగా శాపముకూడ సంప్రాప్తమైనదే దైవమా యనుచుఁ జింతించి 'మహానుభావా! దయామయా! తెలియక యపరాధముఁగావించితిని. అజ్ఞానమువలన నా యాడినమాటలు పాటింపక నన్ను క్షమించి నా శాపము మఱల్పుఁడనుచు దీనముగ మొఱలిడి నమస్కరించితిని. దానికి మునిసత్తముఁడు శాంతించి 'శిష్యా! నా యిడిన శాప మనుభవింపకతప్పదు. కాని నీవు మానవ జన్మలో నుత్తమమైన బ్రాహ్మణజన్మ యెత్తి మునివృత్తితో మెలంగుచు, పూర్వజ్ఞానముమాత్రము లేక మనోదృష్టితో నాగతానాగతముల నెఱుంగఁజాలిన ప్రభావముకలవాఁడవై అనేక మంది శిష్యులకు ధర్మములు బోధించుచునుండి, తుదకు శాపము వలన జన్మించి సదాచారసంపన్నుఁడగు బ్రాహ్మణవటువు శిష్యుఁడుకాఁగా నాతనికి గాంధర్వవిద్యయందు సమగ్రపాండిత్యముగల యొక యువతిచరిత్రము జెప్పి ముగించుటతోడనే యద్దానివలన నతని కుపకృతి కలుగుటయేగాక, నీ శాపము తీరి, నిజరూపముం బడసి సంగీతశాస్త్రమం దత్యంత నిపుణుఁడవై దేవలోకమునఁ

బేరుప్రతిష్టలఁగాంచి సుఖింతు'వనుచు శాపవిమోచనముం జెప్పి యటనే నన్ను విడిచిపోయెను.

నారదుని శాపకారణమున నిట్లు మానవజన్మయెత్తి ముని వృత్తితోఁ గాలముఁగడుపుచునుండ దైవయోగమున నీవు నన్నాశ్రయించుటయు, నీకు సంగీతవిద్యాప్రభావముగల నగజాతవృత్తాంతమును జెప్పుటయు, నందువలన నా శాపముతీరుటయు సంభవించినది. కనుక మీరు చూచుచుండఁగనే యిట్లు మార్పుఁజెంది నిజరూపమును బొందియుంటిని. మునిగా నున్నపుడు దివ్యదృష్టిచే నీ శాపవృత్తాంతమంతటిని దెలిసికొనఁగల్గితినిగాని మహర్షి శాసనమువలన నా విషయ మిసుమంతేనియు నాకుఁ దెలియదాయె.

ఓమహానుభావా! నీవే నా శాపవిమోచనమునకుఁ గారణభూతుఁడవైతి"వనుచు బహుభంగుల నాతని నుతించుచుండెను. అంతట వా రిరువు రాలింగనాదులతో సత్కరించుకొని, యీ రీతి ముచ్చటింప నారంభించిరి.

సు:—దేవోత్తమా! మన యిరువురి శాపవిముక్తికి నా నగజాతయే కారణభూతురాలు. అందువలన నామె ప్రభావ మనిర్వాచ్యమైనది. ఆమెనాధుఁడగు వసుభూపతియు సంస్తవనీయ ప్రభావుఁడని మీరు చెప్పిన చరిత్రములవలననే విశదమగుచున్నది. అట్టి మహిమాన్వితుల చరిత్రమును మీరు చెప్పుటయు, నేను వినుటయు సంభవించినదే కాని, వారిని దర్శించు భాగ్యము మనకుఁ జేకూరదయ్యె. అట్టి పూతచరిత్రులను దర్శించి వెడలుదమా?

హే:—గంధర్వరాజా! అంతకన్న విశేష మేమి కలదు? నేనును నదియే యభిలషించుచున్నాఁడ. వారి సచ్చరిత్ర మెట్లు శాప

విముక్తిదాయకమైనదో యట్లే వారిదర్శనముకూడ సమస్త కల్మషహరము. కనుక నట్లే చేయుదము.

సు:—విబుధోత్తమా! ఎంతకాలమునకు మనము శాపవిముక్తులమై నిజరూపముల నందఁగల్గితిమి? ఆహా! విధికంటెఁ గర్మ బలవత్తరమైనదికదా? అట్టి కర్మపరిపక్వమైన యీ దినముకంటె సుదిన మేది కలదు? అని యాశ్చర్యపడుచుండెను.

అంత హేమకూటుఁడు శిష్యులంగాంచి 'వటువులారా! నేను మునిపతిగా నున్నపుడు మీరు నాయెడఁ జూపిన భక్తి కెంతయు సంతసించితిని. ఇఁక మీ రీ యాశ్రమముననే యుండి భగవంతుని ధ్యానించుచుఁ గాలముపుచ్చుచుండుఁడు. విచార మొందకుఁడు; పోయివచ్చెదను. ఇఁక నాగుఁడు' అని వారి నోదార్చి, వారు చేయు నమస్కారములను గ్రహించుచు, సుదాముని తోఁగూడఁ బయనమై నగజాతా వసురాజులను దర్శింప నధిష్ఠానపురమున కేగెను.

# 15

వసుమహారా జధిష్ఠానపురమునందుఁ బట్టపురాణియగు నగజాతతోఁ గొలువుతీఱి మంత్రి సామంతాదులు తన్ను గొలుచు చుండ రాచకార్యములం జక్కఁబెట్టుచుఁ బ్రజలయెడ నసమాన ప్రేమకలవాఁడై ధర్మమార్గమున రాజ్యమేలుచు నొక దినమున నంతిపురిలోఁ బ్రేయసితోఁగూడ ముచ్చటలాడుచుండెను.

అట్టి సమయమున సుదామ హేమకూటులు దివ్యతేజ ములతో వెలుఁగొందుచు నయ్యాశ్రమమునుండి బయలుదేఱి రాజాంతఃపుర ద్వారమును సమీపించి యటనున్న ద్వారపాల కులచే రాజునకుఁ గబురంపి, వారి యనుమతి కాఁగా లోనఁ బ్రవేశించిరి. రాజదంపతులును సవినయముగ లేచి నిలచిరి. వారి ప్రవేశము వలన నా యంతఃపురము దేదీప్యమానముగఁ బ్రకా శించుచుండెను. అట్టి ప్రకాశమున కచ్చెరువొందుచు నా దివ్య మూర్తులను దోడ్కొనిపోవ వసురాజు ముందున కేగి యెదురుగా వచ్చుచున్న హేమకూటుని గాంచెను. ఆ మహనీయుని దర్శన మైనంతనే వసుభూపతి శిరమున జడలముడి ప్రకాశించు చుండఁ గాషాయవస్త్రధారియై వీణియఁ జేత ధరించి నారాయణ నామస్మరణచేయుచు దేవర్షియై దివ్యరూపముతో నిలచి యుండెను. రాజచూడామణి ముని చూడామణి యగుటకు నగజాతయు, నర్మసచివుండును, నటనున్న పరిచారికలును దిగ్భ్రాంతిఁజెంది నివ్వెఱవోయి చూచుచుండిరి.

నారదమహర్షిని గాంచిన హేమకూటుఁ డాశ్చర్యమొంది 'మహానుభావా? మీరలు మహారాజురూపమును బొంది యీ లోకమున నెందులకు నివసించియుంటిరి? ఇంతలో నీ దివ్య రూపమును ధరించు టేల? అంతయు భ్రాంతిజనకముగా నున్న యది. మహాత్మా! తమవలనఁ బొందిన శాపఫల మనుభవింప నే భూలోకమున కేగిన పిదప జరిగినసంగతు లెవ్వియుఁ దెలియ కున్నవి. కనుక మీ వృత్తాంతమును సమగ్రముగా వచించి నను ధన్యుంగావింప వేడుచున్నాఁడ' ననుచుఁ బ్రార్థించెను. 'హేమ కూటా! నిన్ను గాంచినంతనే నీయందు వాత్సల్య మతిశయించు చున్నది. నీవడిగితివిగాన తర్వాతి వృత్తాంతమును జెప్పెద నాలింపుము.

నిన్నలనాఁడు శపించిన వృత్తాంతమును సహజ విరోధి యగు తుంబురుఁడు విని నాయం దాగ్రహము కలవాఁడై వేచి యుండెను. ఇట్లుండ నొకదినమున మే మిరువురము నింద్రసభకు వెడలుచు దారిలోఁ దారసిల్లితిమి. నన్నాఁతడు సమీపించినంతనే కోప మతిశయింప గన్ను లెఱ్ఱజేసి 'ఓయీ! దురభిమానీ! హేమకూటుఁ డానాఁడు నాకడ విద్యాభ్యాసముఁ జేయుట కను మతి వేడినంతనే నన్ననేక విధములం దూలనాడుచు నాతనికి ఘోరశాపమొసంగియుంటివి.నీ కింతటి కండకావర మేల జనించె? అనేక సభలలో నవమానములఁ బొందియు, నేనే విద్యావంతుఁడ ననుచు విఱ్ఱవీగుట మానవైతివి. నీ యహంకారమునకుఁ దగిన శాస్తి జరిగినఁగాని నీవు చక్కబడ'వనుచు నేమేమో నిందింపఁ నారంభించెను. నేనును సహింపఁజాలక వానిని పెక్కువిధములఁ దూలనాడితిని. అందుల కాతఁడు మిగులఁ గినుకవహించి 'అధిక

ప్రలాపీ! నిష్కారణముగాఁ బరులను శపించుచు, దురభిమానముతోఁ బండితుల దూలనాడుచు గర్వితుఁడవై తిరిగాన. నీవు భూలోకమున హీనజాతియందు జనించి సంసారపంకమున మునిఁగి పలు వెతలఁ గుందెదవుగాత'మని శపించెను. నే నా శాపమునకు భీతిం జెంది 'మహానుభావా! అజ్ఞానమువలనఁ దమను నిందించితిని. ఈ మాత్రమునకే యింతటి ఘోరశాప మీయ నగునా? నే నీ పుణ్యలోకములను విడనాడి పాపపంకిలమగు భూలోకమున నెట్లు నివసింపఁగల్గుదును? బ్రహ్మానందమునకుఁ దావలమైన యీ యాశ్రమమును విడచి దుఃఖములనెడు పెనుభూతముల కాకరమైన గృహస్థాశ్రమమును, నందలి కష్టముల నెట్లనుభవింపఁ గల్గుదును? దయామయా! నా మొఱ లాలించి, నా తప్పులను క్షమించి, శాపమును మఱల్చి కాపాడుఁ'డనుచు బహుభంగుల వేడుకొంటిని.

తుంబురుఁడు వెంటనే శాంతించి జాలికలవాఁడై 'నారదా! నా శాపము మఱల్పరానిది. కాని నీవు భూలోకమున హీనకుటుంబమున జననమొందక మహారాజకుటుంబమునందుఁ బుట్టి, శౌర్యసాహసౌదార్యములయందు మేటివై, యసమాన ప్రతిభావంతుఁడవగుచు; గాంధర్వవిద్యయందు ఘనతవహించి మహాప్రభావురాలైన యొక సుందరాంగిని బరిణయమై, లోకోత్తర కార్యములను జేయుచు, సుఖముల ననుభవించి, నీచే శపింపఁబడిన హేమకూటుఁడు శాపవిముక్తుఁడై నిజరూపము ధరించి నీకుఁ గన్పడినంతనే నీవును శాపవిముక్తుండవై యథారీతి ముల్లోకములు సంచరించుచు బ్రహ్మజ్ఞానముతో విరాజిల్లఁగల'వనుచు శాపవిముక్తిం దెల్పి వెడలిపోయెను. అంత నే నింద్రసభకు వెడల

మనసొప్పక యటనుండి మఱలి భూలోకమున నీ యుత్తమ రాజ కుటుంబమున జన్మించితిని. అంత నీ నగజాతా మహాసాధ్విని బరిణయమై యీ యధిష్ఠానపురమున నివసించుచున్నాఁడను. ఈనాఁడు నీవు కన్పడినంతనే పూర్వస్మృతి కల్గి శాపవిముక్తుఁడనై యీ రూపముతో నిటఁ గాన్పించితిని. ఇదియ నా వృత్తాంత"మనుచు నుడివెను. అపు డా గంధర్వుఁడు గురుభావముతో నారదునకు వందనమాచరించి 'గురువర్యా! నా యవినయముచే నేనే యిట్టి యవస్థను బొందితినిగదా! యని విచారించుచుండ, మీకును నిట్టి యిక్కట్టులే దాపరించినవా?' యనుచు వాఁపోయెను. నారదుఁ డాతని విచారముం గాంచి 'హేమకూటా! విచారింపకుము. ఏదియో కర్మవశమునఁ గొందఱ కిట్టి యపూర్వ సంఘటనలు సంభవించుచుండును. మనమును నట్టి కర్మ విశేషమువలననే యీ కష్టముల ననుభవించితిమి. కర్మ బ్రహ్మాదులకు నైతము దాటరానిదనుట యెఱుఁగవా? కడచినదానికి వగచిన లాభములేదు' అని యాతని నోదార్చెను.

ఈ చరిత్రము వినునప్పటి కా సభలోనివా రెల్ల రచ్చెరువొందుచుండిరి. నగజాతాదేవియు నారదుని శాపవృత్తాంత మామూలాగ్రముగా విని, యా దివ్యరూపమును గనులారఁ గాంచు నప్పటి కామెయు గంధర్వాంగనయై నిలచియుండెను. సుదాముఁ డామెం గాంచి విభ్రాంతిఁజెందినవాఁడగుచు 'ఏమి? ప్రియపత్ని యగు సుజాతయేసుమా యీమె! ఈమె యిప్పటికి వచ్చు టేల? ఔరా! యీ సన్నివేశమంతయు నానందజనకమై యొప్పుచున్నది కదా!' యని యెదఁదలంచుచు 'సుజాతా! యిది యేమి?' యని యడిగెను. ఎల్లరు నిట్టి యద్భుత దృశ్యములకు వెఱఁగంది

యామె వృత్తాంతమును వినఁ గుతూహలులై యుండిరి. అంతట సుజాత తన భర్త శాపానుభవమునకు వెడలిన పిదప జరిగిన వృత్తాంతము నీ విధముగా నుడువ నారంభించెను.

'నాథా! తాము భూలోకమున కేగిన పిదప మీ వియోగమునకుఁ దాళఁజాలక యధిక సంతాపమును బొందియు నేమఱక దేవీపూజను యథావిధిగా నాచరించుచు నెట్లో కాలముఁ గడపుచుంటిని. కొన్ని దినములు గడచునప్పటికి మీ వియోగతాపము మితిమీఱఁ దాళఁజాలక పార్వతీ సన్నిధానముం జేరి 'తల్లీ! లోకమాతా! యీ వియోగభర మే నెట్లు సహింపఁజాలుదును? నా నాథుఁడు చేసిన యపచారమును క్షమించుమని తండ్రికి నీవైనఁ జెప్పకపోతివే! ఇంతకాలమునుండి నిన్నుదప్ప నన్యదేవతం గొల్చి యెఱుఁగనుగదా? నీవే దిక్కని నిన్నే నమ్మియుంటిని. ఆపంతయైనఁ గనికరము చూపకపోతివేమి? నాపై నింతటి కాఠిన్యమేల పూనితివి?—అవును. నీవును గఠినురాలవు కాక యెట్లుందువు? నీ తండ్రియగు పర్వతరాజు పాషాణహృదయుఁడు. నీ సోదరుఁడగు కోలాహలుఁ డంతకంటె కాఠిన్యము కలవాఁడు. నీ భర్తయగు పరమశివుఁడు కనికరము లేక యెల్లరి ప్రాణములు హరించు కఠినాత్ముఁడు. ఇఁక నీవుఁ గాఠిన్య మబ్బుటలో నాశ్చర్యమేమి? ఇంతటి కఠినురాలవని యెఱుంగక మోసపోయి నిన్ను గొలువ నారంభించితిని. ఎందఱినో కాపాడిన నీవు నే నొక్కతెను భారమైతినా?' యనుచు మనోవేదనను సహింపఁజాలక యేమేమో నోటికి వచ్చినట్లు నిందించితిని.

ఇట్టి నా నిందకు రుద్రాణి సహింపఁజాలక కుపితయై 'ఓసీ! దుష్టురాలా! పతివిమోహమునకు లోనై నన్నిట్లు దుర్భాష

లాడితివిగాన నీవు మానవలోకమున జననమొంది, పలు బాము లకు లోనై యుండు'మనుచు శపించెను. ఆ శాపమునకు భయ మొంది 'లోకమాతా! కనికరించుము. నా దోషముల మన్నిం చుము. పతివియోగ శోకమును భరింపఁజాలక యీరీతిఁ బల్కి తినిగాని భక్తిభావము కొఱతపడికాదు. తల్లీ! యీ బిడ్డయందు దయయుంచి నే నాడిన పరుషవచనములఁ బాటించక కాపాడుము' అని పెక్కు తెఱంగులఁ బ్రార్థించుచు దేవి పాదములపై వ్రాలి తిని. కరుణామయయగు గౌరి జాలిఁబూని 'సుజాతా! ఈ శాపము నీకు శుభముగనే పరిణమించును. భయమందకుము. నీ వీ రూప ముతో నిటనే యుండి యీ వియోగభారమును భరించుట కష్ట తరము. కనుక నీవు భూలోకమున నయోనిజవై జననమొంది, గానకళయం దసమాన పాండిత్యమును గడించి, మహాప్రభావము కలదానవై మానవసంజాతుఁడయ్యు నమానుషశక్తి సంపన్నుఁ డైన యొక మహారాజునకుఁ బత్నివై సమస్తభోగముల ననుభ వించుచుందువు. నీ భర్తయు శాపవశమున జనించినవాఁడే యగుటవలన నాతనిశాపము తీఱి, నిజరూపమును ధరించి తన చరిత్రము చెప్పి ముగించినంతనే నీవు నీ మానవరూపమును వదలి నిజరూపమును బడసి భర్తను గలిసి సుఖింతు'వనుచు శాపవిమోచనముం జెప్పెను. అంత నేను శుక్తిమతీ కోలాహలు లకు బిడ్డనై జనించి యీ వసుమహారాజును వివాహమాడి యీ పట్టణమున నుంటిని. ఇపుడు మహారాజు శాపవిముక్తుండై తన కథయంతయుఁ జెప్పగా విని నా నిజరూపమును బడసితిని. ఇంతలో మీ దర్శనము కాఁగా నమందానంద మనుభవించుచుం

టిని. ఇదియ నా వృత్తాంత'మని చెప్పెను. అందుల కా సుదాముఁ డాశ్చర్యమొంది భగవంతుని చెయ్దముల నుతించుచుండెను. ఈ యమ చరిత్ర నెల్లరు మెచ్చుకొనుచుండ భర్త పజ్జంజేరి సంతస మందుచుండెను.'

ఈ రీతి నగజాతా వసురాజులు రూపాంతరములను బొంది రను వార్తను మంజువాణియను ప్రియసఖి విని యదలుచు నెచటినుండియో వచ్చి నగజాతా వసురాజులం గానక దుఃఖా క్రాంతయై యట చూచునప్పటికిఁ దన నాధుఁడు కాన్పించెను. హేమకూటుఁడును నా యువతిం గాంచి తన భార్యయగు మనో రమయని నిశ్చయించుకొని యామె యిచ్చట నుండుటకుఁ గారణము గోచరింపక 'మనోరమా! ఇట కేల వచ్చితివి? ఈమె సేవ నీ కెట్లు లభ్యమయ్యెను? నీ చరిత్ర మెద్దియో సంపూర్ణ ముగ వివరింపు'మని యడిగెను.

అంత నామె 'నాథా! మీరు నారదమహర్షివలన శాపము నుబొంది యా శాపఫల మనుభవింప భూలోకమున జననమం దుటకు వెడలియుంటిరి. మీ వియోగమువలనఁ గాలము గడవక నాకుఁ జిన్ననాటినుండియు నలవాటులోనున్న నృత్యకళయందు గొప్ప నైపుణ్యమును సంపాదించితిని. అంత నొకనాఁ డింద్రుడు కొలువుఁ దీఱియుండ నే వెడలి నా నాట్యప్రదర్శనమున కనుమతి వేడ నాతఁ డంగీకరించెను. ఆ సభయందు నృత్యకళలోఁ బేరెన్నికంగన్న రంభయు నుండెను. అంతట నేను నృత్య మారంభించి వివిధ భంగిమములతో వింతలు గొల్పునట్లు అపూర్వ ములగు నాట్యరీతులఁ బ్రదర్శించి యంతటితో ముగించితిని.

సభలోని వారెల్లరు సెబాసనుచుఁ బొగడి విభ్రాంతిఁ జెందియుం డిరి. రంభ నా నాట్యమును గాంచియు, సభ్యుల పొగడ్తలను వినియు నసూయకలదియై సభలో నన్ను బెక్కువిధములఁ దూలనాడెను. అందులకు నేను గినుకఁజెంది 'టక్కులాఁడీ! నాట్యమాడెదనను నెపముతోఁ దళుకు బెళుకులఁ జూపుచుఁ గాల ముపుచ్చు నీవా నా నాట్యమును దూషించుదానవు? నీకుఁగల నాట్యకళా పాండిత్య మెవరికిఁ దెలియదు? చాలుఁజాలు! నాలుక మిగుల రానీయకుము. నోరు మూసికొను"మని కఠినముగాఁ బల్కితిని. ఆ నింద కామె మండిపడుచు 'నోసీ? ముందువచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు ఘనత కెక్కినట్లు నీవా నా నాట్యమును నిందించుదానవు? నీవిట్లు గర్వముతోఁ బల్కితివి గాన నీవు యథారూపముతోనే భూలోకమున కేగి యొక మానవ వనితకు సేవలు సల్పుచుసుండుము. ఇదియే నీ గర్వమునకుఁ బ్రతిఫల' మనుచు నుడివెను. అందులకు నేను భీతిఁజెంది యామెను బ్రతిమిలాడఁగా నామె శాంతించి 'మనోరమా! నీ గౌరవమునకు భంగము కలుగకుండ మహారాజ పత్నియై, శాప వశమున భూలోకమందు జనించిన యొక దేవవనితకుఁ బ్రియ సఖివై, స్మృతిలేక యామె కనేకవిధములఁ దోడ్పడుచుసుండి. తుద కామె శాపవిముక్తురాలై నిజరూపమును బడసినంతనే నీకుఁ బూర్వస్మృతి కల్గును. వెంటనే నీవు నీ భర్తను గలిసికొందు' వనుచు నుడివెను.

అపుడు నే నా రంభం గాంచి 'అమ్మా! ఆ యువతి యెవరో, ఎటనుండునో తెల్పి యామెకడకు వెడలు నుపాయము ననుగ్ర

హించు'మని వేడుకొంటిని. 'మనోరమా! ఆమె యెవరోకాదు, మన కెల్లపుడు బ్రహ్మసభలోఁ గన్పించు శక్తిమతియొక్క యనుంగుబిడ్డయగు నగజాతయే. శక్తిమతికిని నాకును జెలిమి అధికముగా నుండుటచేఁ దనబిడ్డకు సహాయముగానుండ దేవకన్య కలం బంపుమని ప్రార్థించినది. ఇపుడు నే నామెకడకు దేవకన్నియలం బంపవలసియున్నది. వారితోఁబాటు నీవును వెడలి నగజాతకుఁ బ్రియసఖివైయుండు'మనుచు వచించి నన్నా దేవకన్యకలతోఁగూడ శక్తిమతికడకంపెను.

అంత మేము శక్తిమతి కడకు వెడలి యామె యనుమతిపై నగజాతతోఁగూడ మణిమందిరముం జేరి యందు నివసించుచుంటిమి. ఆమె వసుమహారాజును బెండ్లియాడిన పిదపఁ గోలాహలుఁడు నన్నా సాధ్వికి సహాయముగా నుండుటకై యామెతో నీ పట్టణమునకుఁ బంపియుండెను. అప్పటినుండియు నే నీమె సన్నిధియందే నివసించుచుంటిని. నగజాతాదేవియు నాయందు విశ్వాసముంచి యెక్కువ ప్రేమతోను, మర్యాదతోను జూచుచునుండెను. ఈ లోకమునకు వచ్చిన పిదప శాపవశము వలనఁ గాఁబో లింతవఱకుఁ బూర్వస్మృతి లేకయుంటిని. ఇపుడు శాపవిముక్తియైన కారణమునఁ బూర్వస్మృతి కల్గి నా వృత్తాంతము నంతటిని జెప్పఁగల్గితిని. నాథా! ఈనాఁడు తమను దర్శించు భాగ్యము కలిగినందుల కెంతయు సంతసించుచున్నదాన' నని వచించుచు నాతని కౌగిటం జేరి యానందసుఖము ననుభవించుచు 'మనోహరా! మీరు శాపమనుభవింప నేగిన పిదపజరిగిన వృత్తాంతమును విన్నవింపు'దని యడిగెను. అపుడు హేమకూటుఁడు తన వృత్తాంతమును దెల్పెను.

ఇట్లొండొరుల యపూర్వ చరిత్రములను విని శాపవిముక్తు లెల్ల రొకచోట గుమికూడియుండుట కపరిమితానందమొంది సుజాతా సుదాములును, మనోరమా హేమకూటులును, నారద మహర్షియు దేవలోకమునకు వెడలఁదలఁచి పూర్వము వసురా జెక్కి తిరుగు విమానము నధిష్ఠించిరి. ప్రతినిత్యము వసురా జెక్కినంతనే యాకసమున కెగిరిపోవు నా విమాన మీనాఁ డెందు లకో కదలక యుండెను. నారదుఁ డందులకుఁ గారణమును బరికించి, 'పూజ్యులారా! యింద్రుఁడు వసురాజునకు మాత్రమే దీని నధిష్ఠింప నధికార మిచ్చియున్నాడు. మన మద్దాని నధి ష్ఠించుట కనుమతిలేదు. కనుక నీ విమానమును వదలి మన దివ్యశక్తిచేతనే వెడలుదము' అని వచింప నెల్ల రంగీకరించిరి. ఇంతలో నాకసమునుండి పుష్పవర్షములు కురిసెను. వెంటనే యింద్రుఁడును వచ్చి వారినందఱిని బొగడి తాను వసుభూపతి కిచ్చిన దివ్యవిమాన మధిష్ఠించి తన లోకమునకు వెడలెను.

అంత నారదుఁడు మహతియను వీణను మీటుచు భగవ న్నామ సంకీర్తనముఁ గావించుచు నడుమ నిలచియుండెను. ఆ మహనీయునకొక పార్శ్వమున సుజాతా సుదాములును, రెండవ ప్రక్కన మనోరమా హేమకూటులు నిలచిరి. వారందఱును దేవ తాశక్తితో నాకాశమార్గమున కెగిరి దేవలోకమునకు వెడలి తమతమ భవనములంజేరి యెవరి కార్యములను వారు నెఱవేర్చు కొనుచు సుఖములఁ దేలియాడుచుండిరి.

ఇట నా మునిబృందము తమకు దివ్యబోధలు సల్పి రూపాంతరమందిన గురుపర్యుని విడచి యొంటరిగ నాశ్రమమున

నుండఁజాలక యటకు సమీపముననున్న వాసుదేవుని యాశ్రమ మునకు వెడలి వారి సన్నిధానముననే నిశ్చలమనస్సుతోఁ దపము సల్పుచు నుండిరి. ఆహా! నగజాత ప్రభావ మనిర్వాచ్యమైనది కదా! ఆమె పునీత చరిత్రమే పెక్కండ్ర శాపవిముక్తికి శర ణ్యమై వాసిఁగాంచినది.

ఓం శాంతిః

సంపూర్ణము

